



క్కడ ఒక్కొక్క రాయీ స్వయంగా ఎరుగును లెనిన్‌ను అలనాటి తొలి
క్టొబరు దాడి చేసిన పదధ్వనులద్వారా! ఇక్కడ పతాకాలమీద రాసిన ప్రతి
ాదం లెనిన్ ఊహించిందే లెనిన్ లిఖించిందే ఇక్కడి ప్రతి ప్రాకారం
తని ఉపన్యాసాలకు హర్షధ్వనులు
ుంది అతని వెంట ఎక్కడికైనా సరే

# మన లెనిన్

్ళగలదు ఇక్కడ లెనిన్ అంటే ఎవరో
క్టరీలకీ ఆఫీసులకీ కూడా తెలుసు అతని దారంట అందరూ తమ
ృదయాలను తోరణాలుగా కడతారు నడిపించిందతడే బలమిచ్చిందతడే
ిలో విజయం మీదే అని ప్రకటించిందతడే చూడండి ఇప్పుడు



కార్మికులదే రాజ్యాధికారం ఇక్కడ ప్రతి కర్షకుడూ లెనిన్ పేరును బైబిలు కన్నా పవిత్రంగా చూసుకుంటాడు అతడు ఉన్న నేల లెనిన్ గెలిచి ఇచ్చింది అందుకే అతని తాత ముత్తాతలు అసువులు ధారపోశారు రెడ్ స్క్వేర్ సమాధుల్లో నిద్రిస్తున్న కమ్యూనార్డులు గుసగుసలాడుతున్నట్టుంది: "ప్రియతమా! జీవించు, అంతకుమించిన అదృష్టం మాకు వద్దు నీ ఆశయాన్ని సాధించడానికి మరో పదిసారులైనా మరణిస్తాం మేము" అన్నట్టుగా ......లెనిన్ మన పరాక్రమం కామ్రేడ్ లెనిన్ మన ఆయుధం మన ఆసరా మనజ్ఞానం

# మన లెనిన్

రుత్‌షా ; అలాన్‌పొటెమ్కిన్



అనువాదం

తుమ్మల వెంకటరామయ్య

పాపులర్ ప్రకాశన్స్
గ్రూపు సంస్థలచే బహూకరింపబడినది



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-4



ప్రచురణ : నెం. 842

ప్రథమ ముద్రణ : 1942 జులై

ద్వితీయ ముద్రణ : 1943 నవంబరు

తృతీయ ముద్రణ : 1976 డిసెంబరు

వెల : రు. 1–50

ముద్రణ :

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్, విజయవాడ-4.

# మన లెనిన్

"వొల్గా" నదివొడ్డున "సింబర్క్స్" నగరం. చీకటి పడుతోంది. "యుల్యనావ్" ఇంటి రెండు గదులలో దీపకాంతి ప్రసరించుతోంది. ఒక గదిలో తండ్రి "ఇల్యా" కూర్చొని వున్నాడు. జారు రాజధానీ నగరం సెంటుపీటర్సుబర్గు నుండి వెలువడ్డ పత్రికలను చదువుతున్నాడు. అతడు స్కూళ్ళ సూపరెంటెండెంటు. బీద పిల్లలకు ఉచిత విద్య కావాలని గవర్నరుతో వాదించుతూ అప్పుడప్పుడు గడిపినట్లుగానే ఆ రోజు కూడా గడిపాడు. రష్యాలోని పట్టణాలలోను, పల్లెలలోను ఆ సంవత్సరం (1880) జరుగుతున్న దౌర్జన్యాలను చదువుతున్నాడు. విచారంతో తల పంకించాడు. దగ్గరగానున్న "ఓక్" టేబిల్ పైన టీ పాత్రలలో నీళ్లు సలసల కాగుతూ మర్మరధ్వని చేస్తున్నాయి.

మరో గదిలో తల్లి "మేరియా" "పియానో" వాయించుతోంది. పిల్లలు పాడుతున్నారు. నలుగురు పిల్లలు. అన్నా - వ్లాడిమిర్ - మేరియా - మిత్యా. తల్లి పియానో వాయించుతోంటే, పిల్లలు చిన్న మేకను గురించిన పాట పాడసాగారు :-

"తోడేళ్ళు కూౄరమైన తోడేళ్ళు
పసికూనపై బడ్డాయి"—

పాపం అమాయక మేకను గురించి జాలిపడి చిన్న మిత్యా కన్నీళ్ళు విడువకుండా ఉండలేకపోయాడు. వ్లాడిమిర్‌కు - ప్రతివారూ అతన్ని వొలోడ్యా అని పిలిచేవారు - తమ్ముడు ఏడ్వడం తమాషాగా వుంది. వొలోడ్యాకు ఇప్పటికి 10 ఏండ్లు. పాటనుచూచి ఏడ్చేరోజులు గతించిపోయినాయి. కని తమాషా చేయడం అంటే అతనికి యిష్టం. మిత్యాకు దగ్గరగా వచ్చి తను ఎంతో దుఃఖసూచకంగా పాడుతున్న గొంతును హెచ్చించసాగాడు. భయం కలిగించేటట్లు ఈ క్రింది పాట పాడాడు.

"అవి మేకనంతా తినేశాయ్
కాళ్ళూ కొమ్ములూ మిగిలాయ్"

ఇది మిత్యాకు భరింపరానిదిగా ఉంది. బిగ్గరగా ఏడ్వడం సాగించాడు. తల్లి పియానో వాయించడం ఆపి, కనిష్ఠ పుత్రుణ్ణి సముదాయించడానికి వచ్చింది. వొలోడ్యాను "తమ్ముణ్ణి ఏడ్పిస్తున్నావా వెధవా!" అని నెమ్మదిగా తిట్టింది.

వొలొడ్యా, తమ్ముణ్ణి కౌగలించుకొని చెవిలో యిలా వూదాడు: "ఏం పర్వాలేదు మిత్యా! సాషా తోడేళ్ళనన్నింటిని చంపేస్తాడుగా!" మిత్యా కన్నీళ్ళు తుడిచివేసి నవ్వసాగాడు. నిజమే. తమ్ముడూ! మాస్కో యూనివర్శిటీలో వున్న సాషా రష్యాలోని తోడేళ్ళనన్నిటినీ చంపేస్తాడు. మేకలూ - గొర్రెలూ - కోళ్లు, అన్నిటికీ విముక్తి కలుగుతుంది.

బయటి తలుపును ఎవరో తట్టారు. చిన్నగా - ఉత్సాహంగా ఉన్న - వొలోడ్యా తలుపు తెరవడానికి పరుగెత్తాడు. "హుర్రా! ఓ, వీరా," అని అరచాడు. అతని ఈడు పిల్లే లోపల ప్రవేశించింది. వుత్త బీద దుస్తులు. ఆమె పేరు వినగానే, పేపర్లను అవతల పెట్టిన తండ్రివంకజూచి "గుడ్ ఈవినింగ్" అంటూ అభివాదం చేసింది. "గుడ్ ఈవినింగ్, వీరా" అంటూ అతడు బదులు చెప్పాడు.

"మీరు చెప్పినట్లుగానే వచ్చాను" అంది పిల్ల. ఇంతలో తల్లి ప్రవేశించి "గుడ్ ఈవినింగ్, వీరా! మీ తండ్రి సమాచారం ఏమైనా తెలిసిందా?" అని ప్రవేశించింది.

"ఆ! త్వరలోనే ఇంటికి వస్తున్నాడు."

"ఇవాన్ బాగున్నాడా?" అని వొలోడ్యా అరిచాడు. ప్రతివారూ నవ్వారు. ఇవాన్, వొలోడ్యాకు ముఖ్య స్నేహితుడు. వీరాకు బంధువు. పల్లెటూరిలో వుంటున్నాడు. కొకుష్కినోలో తన తాతగారిని వేసవిలో చూడబోయినపుడు, ఇవాన్‌తో, వొలోడ్యా ఆటలాడాడు. ఇవాన్, ఇంత భూమి చెక్క (దానినే పొలం అంటారు వాళ్లు) మీద పనిచేయని సమయములో ఆడుకుండేవాళ్లు. వొలోడ్యా, ఇవాన్‌కు దున్నడంలో

సహాయపడ్డాడు. ఆవుపాలు పిండడంలో తోడ్పడ్డాడు. అతను ఏం మాటాడినా "ఇవాన్ ఇలా అన్నాడు—ఇవాన్‌కే ఇది తెలుసు...." అనే ధోరణిలో వుండేది. బీదరైతు లెంత బాధపడేదీ ఇవాన్‌వల్ల తెలుసుకొన్నాడు. ధనికరైతులు తోడేళ్లు - అమాయక మేకలపైన పడేవి ఆ తోడేళ్లు.

*　　　*　　　*

వీరాకు ఇవాన్ క్షేమసమాచారం తెలియదు. ఇవాన్ నుండి వాళ్ళకు ఉత్తరం రాలేదు. ఇవాన్ తన తల్లిదండ్రులకు ఉత్తరం వ్రాసి పెడుతుండేవాడు. కాని ఆమెకు తన మామ, అత్త, బావ (ఇవాన్) మరింత అధ్వాన్న పరిస్థితులలో ఉన్నారని మాత్రం తెలుసు.

"వీరా! ఇలారా, నీ పాఠాల సంగతి చూద్దాం" అన్నాడు, వొలోడ్యా తండ్రి; తన పిల్లలవంక తిరిగి "మీరు కూడా మీ పాఠాలు పూర్తి చేయండి" అని అన్నాడు.

"నాది పూర్తి చేశాను నాన్నా!" వొలోడ్యా గంతులేశాడు.

"అప్పుడే!"

"ఆ, స్కూలులోనే" అంది తల్లి నవ్వుతూ.

"అయితే, ఇక్కడ కూర్చొని వీరాకు సహాయం చేయి" అన్నాడు తండ్రి.

వీరా తన కుటుంబాన్ని గురించిన కథ చెప్పడంతో పాఠం, దాని దారిని అది పోయింది. ఆ కథను వొలోడ్యా తన ఆలోచనాపూరితమైన మనస్సులో పెట్టుకొన్నాడు. ఆ చిత్రాన్ని అతడు ఎన్నటికీ మరచిపోలేకపోయాడు.

వీరా తండ్రి నేత పనివాడు. అతనూ, అతని భార్యా, ఒక పెద్ద నేత మిల్లులో పనిచేస్తుండేవారు. వీరా ఇంటివద్ద ఉండేది. ఇంటిని శుభ్రంగా వుంచేది. అయితే నేం, ఇల్లంతా ఖాళీ. కూతురు లేవకముందే తెల్లవారుఝామున అమ్మా, నాయనా మిల్లు పనికి వెళ్ళేవారు. వేసవిలో వీరా రణగొణ ధ్వనితో నిండిన ఇరుకు బజార్లలో ఇతర

పిల్లలతో ఆటలాడుతుండేది. వాళ్ళ తలిదండ్రులూ ఫ్యాక్టరీలలోను, మిల్లులలోను పనిచేస్తు వుండేవారు. చలికాలములో ఇంటిలోపలే కూర్చో నేది. బయటికి పోవాలంటే అమిత చలి. ఆమెకు వెచ్చని కోటుగూడా లేదు. చెప్పులు తెగిపోయాయి. కోటూ, చెప్పులూ కొనిపెట్టేటంతగా చాలినంత డబ్బు ఆమె తలి దండ్రులు సంపాదించలేదు.

సింబిర్స్కులో చాలా మంచివీధులున్నాయి. ఒకరోజున, వీరా, వొలోడ్యా-ఇద్దరూ-అన్నిట్లోకీమంచివీధినినడుస్తున్నారు. "ఎంతవెడల్పుగా వుంది! ఎంత పరిశుభ్రంగావుంది!" అన్నది వీరా. ఆ బ్లాకులోకల్లా పెద్ద యింటిని తోట ఆకర్షవంతం చేస్తోంది. "చూడు! పూలు అందంగా లేవూ?" అని అరచింది వీరా.

"ఈ యింట్లో వుండేది ఎవరబ్బా" అన్నాడు వొలోడ్యా.

"మా అమ్మా, నాయనా పనిచేస్తున్నారే, ఆ మిల్లు యజమానిది." అంది వీరా.

వొలోడ్యా ఆశ్చర్య చకితుడయ్యాడు. ఈ ఇంటికీ వీరా ఇంటికి అంత భేదమా? వీరా ఈడుపిల్ల ఒకతె వరండాలోకి వచ్చింది. మంచి అందమైన తెల్లని దుస్తులు ధరించింది. పెద్ద రబ్బరు బొమ్మ ఒకటి పట్టు కొచ్చింది. వరండాలో ఒక మంచి బైసికిలు వుంది. వొలోడ్యా ఈ పిల్ల వంక, తర్వాత వీరా వంక చూచాడు. వీరా బక్కపల్చగా వుంది. దుస్తులు రంగు మాసిపోయి అంచులు చిరిగిపోయి వున్నాయి. వీరాకూడ ఆ ధనికుని మిల్లులో ఆ ధనికుని కూతురుకోసం పని చేయాల్సివుంటుంది త్వరలోనే.

* * *

వేసవికాలం. భగ్గున మండుతోంది. చరణాకోలుతో కొట్టే యజ మానిలా సూర్యుడు వేడి కిరణాలతో కొడుతున్నాడు. వర్షం లేనేలేదు. పట్టణాలలో కార్మికునికి ఊపిరి పీల్చడమే కష్టంగా వుంది. వీరా తల్లి దండ్రులు పనిచేసే మిల్లులో బయటికంటె కూడా వేడిగా వుంది. యిక వీరా మామ, అత్తా, బావ, వున్న పల్లెటూరి సంగతి మరీ అధ్వాన్నం. ఇవాన్, అతని తలిదండ్రులూ, షాహుకారి పొలాల్లో పనిచేస్తుంటారు.

చలికాలపు మంచుగడ్డలు కరిగిపోగానే, ప్రతిరోజూ వాళ్లు పొలంవెళ్ళి పని చేసేవారు. విత్తులు వేయడం, భూమిని పాతకాలంనాటి బరువాటి నాగళ్ళతో దున్నడం—ఇదీ వారిపని. ఇవాన్ వాళ్ళతోనైనా పనిచేసేవాడు. లేదా తమ బీడుభూమిని కాపలా గాయడానికో, ఆవుపాలు పిండడానికో, ఇంటివద్ద ఉండిపొయ్యేవాడు. ఆ ఆవంటే వాళ్ళకెంతో యిష్టం. తమకు తిండానికే సరిగ్గా దొరక్కపోయినా, ఆ ఆవును ఎలాగో కష్టపడి పోషిస్తుండేవారు.

ఒకరోజున వాళ్ళంతా తమ గుడిసెలో కూర్చునివున్నారు. ఎవరో తలుపు తట్టారు. భూస్వామి మగతాకోసం ఆ మనిషిని పంపాడు. ఇవాన్ తండ్రిదగ్గర డబ్బులేదు. కొన్నిరోజులు ఆగమని బ్రతిమాలాడు. నీవు చెల్లించకపోయావా, నీ ఆవును తీసుకుపోయి అమ్మేస్తాను" అని గద్దించాడు షెరీఫ్. "ఆవును తీసుకుపోతే మా పిల్లాడికి పాలుండవు" అన్నాడు ఇవాన్ తండ్రి.

"ఆవును యిస్తే ఈయండి. లేకపోతే మిమ్మల్ని జైలులో పెడతాను" అన్నాడు షెరీఫ్. ఆవును తోలుకుపోయాడు.

తల్లి ఏడ్చింది. ఇవాన్‌కూడా ఏడ్చాడు. ఆవును తోలుకెళ్ళడం వాళ్ళకెంతో కష్టం కలిగించింది.

ఇలాగే డబ్బులేని యితరరైతులుకూడా తమ తమ వస్తువుల్ని వదులుకోవలసివస్తుంది. ఆ గ్రామ రైతులనుండి, ఇతర గ్రామాల రైతులనుండి, షెరీఫ్‌లు ఇలాగే పట్టుకెళ్ళారు. ఒకళ్ళదగ్గర గుర్రాన్ని, మరొకరిదగ్గర గొర్రెల్ని, యింకొకరిదగ్గర పశువుల్ని—ఇలా.... రైతులు ఏమి చెప్పడానికి కూడా జడిసేవారు. కానిచిరకాలంనుండి వాళ్ళ పశువులు ఎలా తీసుకుపోతున్నారో వాళ్ళకి జ్ఞాపకంవుంది. వాళ్ళ హృదయాల్లో క్రోధాగ్ని రాజుతోంది.

గ్రామ సమీపంగా భూస్వామికి పెద్ద అందమైన భవనం వుంది. తెల్లగా సున్నంగొట్టిన ఇల్లు. లోపల మెత్తని తివాచీలు, మంచిబొమ్మలూ వున్నాయి. ఇంటిచుట్టూ పెద్దతోటా, తోటచుట్టూ ఇనుపకంచె వున్నాయి. వేసవిలో భూస్వామి ఈ భవనంలో వుంటాడు. చలికాలంలో

ఉండేందుకు అతనికి మరో వెచ్చదనం కల్గించే భవనంకూడా వుంది. వేసవిలో చల్లదనం కల్గించే మరో భవంతికూడా వుంది. ఇవాన్, అతని తలిదండ్రులు, వాళ్ళ ఆవూ, అందరూ ఒకేగదిలో వుండేవాళ్లు. తాము పనిచేసే భూస్వామిదే ఆ అందమైన తోటా, ఆ పెద్ద ఇల్లూ, పొలాలు, మైదానాలు కూడా ఆ భూస్వామివే. ఇంకా ఇవాన్ తన తలిదండ్రులతో వుంటున్న గుడిసె, గడ్డిచాపల గుడిసె—ఆవూ—ఇవన్నీ ఆ భూస్వామివే. రైతులందరి గుడిసెలూ భూస్వామివే. ఆవుతోసహా అతనిదే. ప్రతి వేసవికాలం భూస్వామి తన పెళ్ళాంతోను, కొడుకుతోను ఇక్కడికి వస్తాడు. కొడుక్కి ఇవాన్ ఈడే వుంటుంది. కాని అతగాడికి ఇవాన్ కలగంటానికయినా సాహసించని అనేక రకాల వస్తువు లుండేవి.

"ఏయ్! ఇవిగో నాకు రబ్బరు బొమ్మలూ, పంచదార బిళ్ళలూ, బొమ్మల పుస్తకమూ, వున్నాయి చూడు." అంటూ ఆ ధనికుని బిడ్డడు కంచెలోపల వుండి ఇవాన్‌ను ఏడిపిస్తుండేవాడు.

ఇవాన్ ఆశ్చర్యంతో ఏమీ చెప్పలేక పోయేవాడు. ఆ బొమ్మల పుస్తకం వంక అదే పనిగా చూసేవాడు.

ధనికుని బిడ్డడు "నాకో స్వంత గుర్రంవుంది. నదిలో ప్రయాణం చేయడానికి నాకో స్వంత బోటు కట్టిస్తున్నారు. నీకేముంది?" అని మళ్లా అన్నాడు.

ఇవాన్. ఆడుకొనేందుకు తన కేమీ లేవని చెప్పబోయేముందే, ఆ బిడ్డని తల్లి-పెద్ద బండగా వుంటుంది....తన కొడుకుని పిలచి, రైతు కుర్రాడితో మాటాడినందుకు తిట్టింది.

* * *

పట్టణంలో యజమాని ఎక్కువలాభాలు కావాలని కోరాడు. అతని భార్య, చలికాలంలో కొత్తఫర్ (బొచ్చు) కోటు, వసంత కాలానికి మరో క్రొత్త బగ్గీ కావాలని కోరింది. ఇక కూతురుకు క్రొత్త ఫ్రాక్ (గౌను)లు కావాలిసి వుంటుందిగదా! కోటూ, బగ్గీ, ఫ్రాక్‌లూ, ఎవరిస్తారు? కార్మికులు! వాళ్లు ఇంకా ఎక్కువ వస్తువులు తయారుచేయాలి. యజమాని ఫోర్‌మెన్‌ను పిలిచి "కూలీలను ఇంకా తొందరగా పనిచేసే

టట్లుచేయి" అని ఆజ్ఞాపించాడు ఎక్కువ గంటలు పనిచేయాలి.... అని నోటీస్ అంటించాడు. జీతంలో కోత గోశాడు.

*　　　*　　　*

పల్లెటూళ్ళలో, రైతుల బీదభూమిలో పండదం లేదు. ధనిక భూస్వామికి ఏ చింతా లేదు. అతని భూములు యిర్రిగేషన్ సహాయంవల్ల తడుస్తున్నాయి. రైతులు అతనివద్దకు వెళ్ళి సహాయం చేయమని ప్రార్థించారు. భూస్వామి భుజాలు ఎగురవైచి "మతగురువుల్ని అడగండి" అన్నాడు. వర్షం కురవడానికిగాను మతగురువులకు ఇదివరకు ముడుపులు చెల్లించారు. ఇవాన్‌తండ్రి 'ప్రార్థనలవల్ల వర్షం కురవదు. ప్రార్థన మా ఆవును మా కిప్పించదు' అని అన్నాడు. రైతులు తమ పెద్దపెద్ద పవిత్ర విగ్రహాలు పొలాలకు తీసుక వెళ్ళారు. ప్రార్థన చేశారు. తమ నుదుళ్ళు బీటువారిన భూమిని తాకేట్టు సాష్టాంగ పడ్డారు. కాని వర్షం కురవలేదు. ఆకాశం నిర్మలంగానే వుంది. ఒక్క వర్షపు చినుకయినా పడలేదు.

పంటలేదు. బీదరైతులు మలమల మాడుతున్నారు. అయినా భూస్వామి, తనకొట్లలో ధాన్యం నిల్వపోశాడు. ప్రజలు వాటివంక వేలెట్టి చూపేవారు. తలలు పంకించేవారు. "ఆయన మనకి వర్షం ఈయలేక పోయాడు. నిజమే. కాని తింటానికి కాస్త ధాన్యం తప్పకుండా ఇస్తాడు. ఆయనకు కావలిసినంత వుంది." మైదానం దాటారు. ఇనుపగేటు తెరిచారు. ఆ పెద్ద తెల్లటి బంగళాముందు నిలబడ్డారు. టోపీలు (హేట్స్) తీసి నమస్కారం చేశారు. భూస్వామి చాలా గొప్పవాడు గాదూ మరి! ఆయనకి ఏదిబడితే అది కొదవలేకుండా ఉందిగదూ! ఆయన గొప్పవాడు!

"నేను మీకేం ఈయను" గర్జించాడు భూస్వామి, "అంతే."

ఇవాన్ తండ్రి ముందుకొచ్చాడు. అతని రక్తం ఉడుకెత్తుతోంది. "మాదే మేము అడుగుతున్నాం. మీరు భూమినేమైనా దున్నారా? మీరేమైనా విత్తులు చల్లారా? మేం మా చేతులారా దున్నాం, విత్తులేశాం" అని అన్నాడు.

"నిజం! నిజం!!" అని అరిచారు రైతులు.

భూస్వామి మండిపడ్డాడు. "నీకు బుద్ధిచెపుతాను" అని అన్నాడు. ఇవాన్ తండ్రిని అరెస్టు చేయించాడు. తక్కిన రైతులను కొరడాలతో కొట్టించాడు.

* * *

పట్టణంలో కార్మికులు బానిసత్వ బాధనుసహించలేక పోతున్నారు. వీరా, 'అమ్మా! ఆకలిగావుందే. ఏమన్నా తింటానికిలేదూ?' అనిఅంది. వీరా, తండ్రి దగ్గరవున్న మరో కార్మికునితో ఇలా అన్నాడు. "ఇంకా ఇలాగే కొనసాగడానికి వీల్లేదు. మన పిల్లలు పస్తుంటున్నారు. కామ్రేడ్, మన పిల్లలకోసం మనం పోరాడాలి. మనం గనక అసమ్మతి తెలియ జేయకపోతే ఇంకా తక్కువ జీతాలతో మరింత అధ్వాన్నపు బానిసలమై పోతాం. మనం అంతా కలిసివుంటే మనం బలంగా వుంటాం."

కార్మికులు పని మానివేశారు. చక్రం తిరగడంలేదు. పనిముట్లు క్రింద పడవేయబడినాయి. న్యాయమైన పని గంటలకోసం, తగిన జీవిత భృతికోసం కార్మికులు సమ్మెచేశారు. ఒకరోజు గడిచిపోయింది. "ఓ! వాళ్ళేవస్తారు." అని పకపక నవ్వాడు యజమాని. రెండురోజులు గడి చాయి. "ఓ! వాళ్ళేవస్తారు" అని చిరునవ్వు నవ్వాడు యజమాని. మూడురోజులు గడిచాయి. "ఉఁ, వాళ్ళే వస్తారు!" అని ముఖం చిట్లిం చాడు యజమాని. ఒకవారంరోజులు గడిచాయి, "రండిరా! అంతా సక్రమంగా సరిపెడతానుగా" అని పండ్లికిలించాడు యజమాని.

కాని కార్మికులు తెలివిగలవాళ్లు. వాళ్ళు దగా పడరు.

"మిమ్మల్ని పనిలోకి వచ్చేటట్టు చేస్తాను!" అని మొరిగాడు యజమాని. వీరా ఇల్లును పోలీసులు ముట్టడించారు. తల్లిని ఒకప్రక్కకు త్రోశారు. బిడ్డను కాలితో తన్నారు. తండ్రిని జైలుకు తీసుకపోయారు. "నీవు నాయకుడివి. నీవే ఈ సమ్మెను ప్రారంభించావు. దానికి అనుభ విస్తావులే" అన్నాడు జడ్జి. ఇంకా చాలమంది అరెస్టు గావించబడ్డారు. జారు సేవకులు ధనికుల సేవకులు.

వొలోడ్యాకుఈకథలన్నీ బాగా తెలుసు. అవన్నీ నిజమైన కథలు. అతని హృదయంలో గాఢంగా చొచ్చుకుపోయిన కథలు. స్కూళ్ళలో

నేర్పిన సన్యాసుల కథలకంటేనూ, దాదిచెప్పిన పిట్టకథలకంటేనూ కూడా బాగా వీటిని జ్ఞాపకం పెట్టుకున్నాడు. ఏ కథల పుస్తకంలోని నాయిక కంటె గూడా వీరాయే అతనికి గొప్పవ్యక్తి. ఆమెతండ్రి సమ్మెచేశాడు. అతడు ధైర్యంగల కామ్రేడ్, కాబట్టి, అతన్ని వాళ్ల జైలులో పెట్టారు.

"ఇంటికి త్వరలోనే రాబోతున్నాడు;" అన్నది వీరాసంతోషంతో "మళ్లా ఇంకోసమ్మె నడుపుతాడు" అని చేర్చింది సగర్వంగా.

ఆ, ఔను ! వీరా తండ్రి గొప్ప వీరుడే కాని వీరులందరి లోను గొప్ప వీరుడు తన అన్న 'సాషా'

* * *

వేసవి సెలవులు వచ్చాయి. వాటితోపాటు అన్న సాషా కూడా వచ్చాడు. వొలోడ్యా అన్నకోసం ఎంత వేచి వున్నాడను కొన్నారు ! తండ్రితో అప్పుడప్పుడు ఆడుకొన్నట్లుగానే అన్నతోచదరంగం ఆడవచ్చు అన్నతోపాటు అడవులకి వెళ్ళవచ్చు. అన్న అక్కడ మొక్కలూ, పురుగులూ ఏరతాడు. సాషా 'నేచురలిస్టు' విద్యార్థి మీటింగులను గూర్చి సాషా చెబుతాడు. సాషా తనకి ఆదర్శప్రాయుడు. "నేను కూడా పెద్దయ్యాక, అన్న సాషాలాగా కావాలి" అనుకొనేవాడు వొలోడ్యా.

ఆఖరికి బండి ఇంటిదగ్గరకు రాగానే, వొలోడ్యా అన్న మెడను కౌగలించు కొన్నాడు. "నీవు రావనుకొన్నాను" అని అరిచాడు.

సాషాను చూడటానికి ఆసాయంత్రం ఎవరో బంధువులువచ్చారు. పీటర్సుబర్గ (ఇప్పటి లెనిన్‌గ్రాడ్) రాజకీయ ఆందోళననుగురించి సాషా చెప్పాడు. "రోజురోజుకూ ప్రజలదుస్థితిని గురించి విద్యార్థులు తెలిసి కొని మేల్కొంటున్నారు. "ప్రజల స్వాతంత్ర్యంతో కట్టుబడే మా స్వాతంత్ర్యం వుందని మాకు తెలుసు. కాని జార్...అతని గూఢచారులు ....మా మధ్యనే వున్నారు !" వొలోడ్యా కళ్ళు ఇంతచేసుకొని, చెవులు నిక్కబొడుచుకొని విన్నాడు. తల్లికొంచెం కంపించడం అతడు చూశాడు. కాని ఆమె ఏమీ మాటాడలేదు. తల్లినిజూచి వొలోడ్యా గర్వపడతాడు.

"రష్యా, జారు లేకుండా విముక్తిచెందితే!" అన్నాడు సాషా.

వచ్చిన అతిథులలో ఒక లేడీ డాక్టరువుంది. ఆమె ఇలా అంది. "మనం పూర్తిగా మార్పుచేయాలి. పెట్టుబడిదారులను వదిలించుకోవాలి."

జైలునుండి విడుదలై వచ్చిన వీరాతండ్రి, "ఉన్నకొద్దీ ఇంకా ఇంకా కావాలంటారు యజమానులు." అని అన్నాడు.

ఫలహారమూ, టీ తెచ్చారు. సంభాషణ సంతోషంగా తమాషాల లోకి మారింది. వొలోద్యా డాక్టర్ చేతినితాకి ఇలా అన్నాడు. "డాక్టర్ గారూ, మీకు తెలుసుగా, నేను జబ్బుమనిషిని."

డాక్టర్, వొలోద్యా తమాషాగా మాటాడుతున్నాడని అనుకొంది. చాల సీరియస్ ముఖంపెట్టి అతని నాడిచూచి అడిగింది "ఏంటిజబ్బు?"

రోగి జవాబిచ్చాడు– "నాకు సంతృప్తి అనేదే లేదు, బిస్కట్లు తిన్నకొద్దీ ఇంకాతినాలనిపించుతుంది. బహుశా నేనుపెట్టుబడిదారుణ్ణేమో." అందరూ నవ్వారు. సాషా, వొలోద్యామీదికి ఉరికి "ఐతే దానికి ఒకే మందువుంది. అది విప్లవమందు, రోగిని బయట పారేయాలి." అని తమ్ముణ్ణి చుట్టుముట్టి మరో గదిలో పారేశాడు. తక్కినవాళ్ళందరూ నవ్వుతూ ఒకళ్ళకొకళ్ళు పేర్లుపెట్టుకొంటూ కూర్చున్నారు.

వాళ్ళందరూ మార్చి ఉత్సవంలోనికి వెళ్ళారు. పక్షుల్ని కొనడం, వాటిని స్వేచ్ఛగా వదలిపేయడం ఆ పండుగకు ఒక ఆచారం. వొలోద్యాకు ఆ ఆచారం అంటే బలే ఇష్టం. పక్షిని కొంటానికి వాళ్ళ అమ్మ కొన్ని డబ్బులు ఇస్తుంది. వొలోద్యా దానిని పంజరంలో పెట్టి, ఆ తరువాత దానిని స్వేచ్ఛగా వదలివేస్తాడు. ఈసారి ఒక చిన్నపక్షిని (టిటిమౌస్) కొని పంజరంలో పెట్టాడు. కాని దానికి మేతా నీళ్ళు వేయడం మరచిపోయాడు. పాపం అది చచ్చి ఊరుకుంది. విచారమూ, తీరని అవమానమూ అతన్ని కదల్చివేశాయి. "ఇక ఎప్పుడూ పక్షిని పంజరంలో పెట్టను" అని ఏడ్చాడు.

* * *

ఆటల్లో, పనిపాటల్లో వొలోద్యా మానవ ప్రపంచాన్ని గురించి నేర్చుకొన్నాడు. మానవులు పడే బాధలను తెలిసికొన్నాడు. ఒకరోజున పెద్ద విచారం వచ్చిపడింది. అకస్మాత్తుగా అతని తండ్రి చనిపోయాడు.

సాషా, తక్కినవాళ్ళు పీటర్సుబర్గులో వున్నారు. వొలోద్యా ఒక్కడే ఇంటిలో మగపురుగు. తల్లి దుఃఖాన్ని శమింపజేయడానికి విచారంలోనే నవ్వాడు. ఆమెకు సహాయం చేయడానికి ఎల్లప్పుడూ ఆమెదగ్గర వుండేవాడు. దూతగా పనిచేసేవాడు. వార్తలు తెలియజేసేవాడు. అతని పెద్ద అక్క 'అన్నా' పట్టణంనుండి వచ్చింది. ఆమె అక్కడ చదువుతోంది. వొలోడ్యా లాటిన్‌లో మంచి తెలివిగల విద్యార్థి. ఉన్నత విద్యకోసం అన్నా లాటిన్‌లో కృషి చేయాలి. వొలోడ్యా ఆమెకంటె చిన్న అయినా ఆమె చదువులో సహాయపడ్డాడు.

"నీవు చాలా మంచి ఉపాధ్యాయుడవు వ్లాడిమిర్ !" అన్నది అన్నా అతనికి పెట్టిన పేరుతో పిలుస్తూ.

"అయితే నన్ను ఇకనుండి ప్రొఫెసర్ వ్లాడిమిర్ ఇల్యిచ్ యుల్యనావ్‌గారు అని పిలువు."

"ఇల్యిచ్, నీవు తండ్రికి తగిన కుమారుడివి. మన నాన్న కూడా మంచి ఉపాధ్యాయుడే సుమా !" అని, అక్క చెవిలో ఊదింది.

"ఆయన హృదయమున్న మనిషి. మెదడువున్న మనిషి". అక్కా తమ్ముడూ, సెంట్‌పీటర్సుబర్గును గురించి, అక్కడ కార్మికులనుగురించి అన్న సాషాను గురించి మాట్లాడుకొనేవారు తరుచుగా. "వ్లాడిమిర్, అన్న చాలా ధైర్యశాలి. కాని అతని ప్రాణం గురించి భయపడుతున్నాను."

"ఓ, సాషాను ఏదీ దెబ్బ కొట్టలేదు." అని బిగ్గరగా వ్లాడిమిర్ ఇల్యిచ్.

అన్నా పీటర్సుబర్గుకు తిరిగి వెళ్ళింది. సాషా ఏదో ప్లానులతో నిండా తల మునిగి వుండడం ఆమె చూచింది. అతనితో కూడా ఆమె వుండిపోయింది. విద్యార్థులు రైతులకు, కార్మికులకు సహాయం చేయాలనుకొన్నారు. "అందరిలోకల్లా జార్ ధనిక భూస్వామి, ఇతర భూస్వాములకు రైతులను దోపిడీ చేయడంలో సహాయపడుతున్నాడు. సమ్మెచేసిన వారిని జైలులో పెట్టేది అతని పోలీసులే. అతని కోసక్ సైన్యాలు యూదులను హత్య గావించుతున్నాయి. మనం జారును చంపాలి" అన్నాడు సాషా.

విద్యార్థులు భూమి అడుగు కొట్లలోనూ, మేడల చివరి అంతస్తు గదులలోను రహస్యంగా కుట్ర చేస్తుండేవారు. ఇతరులు నిద్రపోయేప్పుడు, రాత్రిళ్ళు వారు కలిసికొని ఏమిచేయాలో ప్లాను వేసికొనేవారు. సాషా వారికి నాయకుడు. సాషా తన చెల్లెలు అన్నాతో, జార్ చక్రవర్తి వింటర్ భవనాన్ని దాటి వెళ్ళినప్పుడల్లా ఇలా అనేవాడు. "బానిసత్వానికీ, ఆకలి మంటలకూ కారణం దానిలోపల వుంది. ప్రజల దౌర్భాగ్య దశకు కారణమైనదాన్ని మనం నాశనం చేయాలి. మనం జారుని చంపాలి."

మూడవ అలెగ్జాండర్ అప్పటి జార్. రెండవ అలెగ్జాండర్‌ను, టెర్రరిస్టు ధైర్యశాలుల ముఠాలో ఒకరు చంపివేశారు, కాని మూడవ అలెగ్జాండర్ పరిపాలనలోకూడ పరిస్థితులు అంత అధ్వాన్నంగానేవున్నాయి. ఎక్కడ ప్రజలు సమకూడినా అక్కడ పోలీసులు ప్రత్యక్షం. మీటింగు నుండి వెళ్ళేవాళ్ళను పట్టుకొని అనేక ప్రశ్నలు వేసేవారు. ఒక్కసారి జార్ ప్రజల నోటికి తాళం వేయాలనుకొన్నాడు. అందుచేత స్వాతంత్ర్యము అనే పదం ఉచ్చరించడానికి వీల్లేదు. సాషా, అతని మిత్రులూ, వారి ప్లాను బయట పడితే చిత్రహింసకూ, మృత్యువుకూ పాల్పడాలి. కాని మృత్యు భయంగాని, చిత్రహింస భయంగాని వారి నాపలేకపోయింది. వారు జార్‌ను చంపే దినమూ, గంటా నిశ్చయించుకొన్నారు.

ఒక రోజున వొలోడ్యాను క్లాసునుండి ఇంటికి పిలిచారు. హైస్కూలులో అతని కిది ఆఖరు సంవత్సరం. తమ కుటుంబ స్నేహితురాలు ఒక ఉపాధ్యాయిని నుండి ఒక చీటి వచ్చింది. ఆమె అతని కేదో చెప్పవలసిన వార్త వుంది. వొలోడ్యా దగ్గరకు రాగానే, ఆమె, అతన్ని ధైర్యం వహించమంది. పీటర్సుబర్గులోని అతని బంధువులనుండి ఒక ఉత్తరం వచ్చింది. అతని ముఖం గంభీరాకృతి దాల్చింది. అతని చేతివ్రేళ్ళు అరచేతులను నొక్కుతున్నాయి. "సాషా జారుకు వ్యతిరేక కుట్ర సందర్భంలో అరెస్టయ్యాడు. అన్నా కూడా అరెస్టయింది." అని చదివాడు. స్నేహితురాలు కుర్రవాడిముఖం పరీక్షించింది. "ఇతడు ఇంక చిన్న వొలోడ్యా కాదు. ఇతడు జ్ఞానమొచ్చిన మనిషి. ఇతడు వ్లాడిమిర్ ఇల్యిచ్" అని అనుకొంది.

వ్లాడిమిర్ ఇల్యిచ్ ఉత్తరం చూచి, కళ్ళు పైకెత్తాడు. దృఢ స్వరంతో ఇలా అన్నాడు. "గడ్డు విషయం. సాషా కిది ఆపదగా అంత మవ్వచ్చు."

తల్లికి చెప్పవలసిన బాధ్యత వ్లాడిమిర్‌ది. ఈ కర్తవ్యాన్ని నెర వేర్చడానికి ధైర్యం వహించాడు. 'అమ్మా' సాషాకు ఆపద వచ్చింది. తల్లి రెండు చేతులూ గట్టిగా పెనవేసింది. "ఆమె చాలా ధైర్యంగలది" అని గర్వపడ్డాడు వ్లాడిమిర్. "మరి అన్నా?" ప్రశ్నించింది తల్లి. "ఆమె కూడా" అని జవాబిచ్చాడు కొడుకు.

ప్రయాణ సన్నాహంలో తల్లికి సహాయపడ్డాడు. ఆమెతోపాటు స్టేషన్‌కు వెళ్ళాడు. ఇంటికి తిరిగి వెళ్ళుతూ ఇలా ఆలోచించడం మొదలెట్టాడు. "సాషా ఇంకేం చేయగలడు. అది తప్పనిసరి. అతడు దానిని చేయక తప్పదు. చేయక తప్పదు" త్రోవలో పీరాను కలిసి కొన్నాడు. జరిగిన విషయం చెప్పాడు.

"మీ అన్న అద్భుతమైన యోధుడు" అంది ఆమె.

అతడు జవాబు చెప్పలేదు. కాని "అన్న తెలివిగల యోధుడేనా?" అని ప్రశ్నించుకొన్నాడు తనలో తాను.

"సాషా, రానున్న విప్లవాన్ని చెప్పేదూత అని మా నాన్న అంటాడు."

"అవును, సాషా, రానున్న స్వాతంత్ర్య దినాన్ని చెప్పే దివ్య దూత" అని మనస్సులో అనుకొన్నాడు.

అతడు లేడీ డాక్టరుతో సాషా అరెస్టు గురించి చెప్పినపుడు ఆమె తల పంకించి యిలా అంది. "చాలా ధైర్యశాలి, కాని ఒంటరిగా బాంబు తుపాకీ తీసుకొనివెళ్ళడం పనికిరాదు. జారు, అతని ధనికప్రజలు కార్మికుల్ని చంపవచ్చు. అయినా వాళ్ళంతా స్వేచ్ఛగానే తిరుగుచున్నారు. జారునూ, దోపిడీచేసే ధనికుల్నీ వదిలించుకోవాలంటే కార్మిక, కర్షకులు కలిసి పోరాడాలి. వారంతా కలిసి భూస్వాముల పరిపాలననూ, జారు పరిపాలనను, మిల్లు యజమాన్ల పరిపాలనను సమూలంగా నాశనం చేయాలి."

ఇంటిమధ్య, చిన్నపిల్లలు, మేరియా, మిత్యా ఎదవడం సాగించారు. వాళ్ళను సంతోష పెట్టడానికి, వాళ్ళతో వ్లాడిమిర్ ఆటలాడేవాడు. పరిష్కరించమని కొన్ని పజిల్స్ వేసేవాడు. తానూ ఇంతలో సాషా సమస్యను పరిష్కరించ ఆలోచిస్తున్నాడు ఒక ప్రక్క. అతనికి సమాధానం తెలుసు. "రైతులు, కూలీలు, సైంటిస్టులూ, స్వతంత్ర ప్రపంచం గోరేవారంతా జారునేగాక, పీరాలాంటి, ఇవాన్‌లాంటి కూలీలను తక్కువ జీతంతో క్రూరమైన శ్రమభారంతో పీడించే యజమానులను-బ్యాంకర్లను, భూస్వాములను కూలద్రోయడానికి ఏకంకావాలి."

తల్లి తిరిగివచ్చింది. ఘోరమైన వార్త చెవిని బడవేసింది. "సాషా చనిపోయాడు. ఉరి తీశారు!" వ్లాడిమిర్ వణికిపోయ్యాడు. "జీవితాన్ని అంతగా ప్రేమించిన ధైర్యశాలి నా సోదరుడు—సోదరుడు." ఆ రోజును వ్లాడిమిర్ ఎన్నడు మరచిపోలేదు.

"అన్నా, మీ తాతగారివద్ద కొకుష్కినోలో ఉండవలసివుంటుంది" అన్నది తల్లి.

* * *

స్వాతంత్ర్య మహా పోరాటంలో తానుకూడా పోరాడవలసివుంటుందని వ్లాడిమిర్ తలచాడు. ఆ పోరాటంలో తన సోదరుడు మరణించాడు. తన సోదరి ప్రవాసశిక్షకు గురియైంది. ఆమెను ఇంకా దూరంగా జడ్జీలు పంపేవాళ్ళే. కాని తల్లి ఆమెకోసం పోరాడింది. "నాబిడ్డ నొకణ్ణి చంపారు. ఈమెను కూడా మీరు తీసుకు పోరాదు." చివరకు జడ్జీలు అంగీకరించి "సరే, కొంతకాలం ఈమె ఈ పట్టణంలో వుండకూడదు. ఆమె ప్రవర్తనకు మీరు బాధ్యతవహించాలి" అని అన్నారు.

తన సోదరుని మరణం వ్లాడిమిర్‌ను గట్టిపరచింది. ఆ సంవత్సరమే కజాన్ యూనివర్సిటీలో చదవడానికివెళ్లాడు. విద్యార్థి పోరాటాలలో అతడు తీవ్రంగా పాల్గొన్నాడు. ప్రతిచోటా సి. ఐ. డీ. లే. స్టూడెంటు క్లబ్బులను నిషేధించారు. అపాయకరంగాని వాటినిగూడా నిషేధించారు. ప్రభుత్వం గాభరాపడింది. భయం క్రూరుణ్ణి మరింత క్రూరుణ్ణిగా చేస్తుంది. కాని విద్యార్థులు ఆగలేదు. వారు కలిశారు. ప్రదర్శనలు సాగించారు. ఈ క్రింది కోర్కెలు కోరారు.

విద్యార్థి హక్కులను తిరిగి ఈయండి!
వాక్స్వాతంత్ర్యం కావాలి!
నిర్బంధ పరిపాలన అంతమొందాలి!
సమావేశ స్వాతంత్ర్యం కావాలి!

వ్లాడిమిర్ ఈ యువకపోరాటానికి నాయకుడు. అతని అన్నలాగానే వ్లాడిమిర్ కూడా అరెస్టుకాబడ్డాడు. జడ్జీలముందుకు అతన్ని తీసుకువచ్చారు. జారు ఏజంటు (జడ్జి) ఉన్నతాసనంమీద కూర్చుని వ్లాడిమిర్ ఇల్యిచ్ యుల్యనావ్‌తో ఇలా అన్నాడు: "ఎందుకు నాయనా తిరగబడతావు. యువకుడవు. నీముందు రాతిగోడ నీకు కన్పడటంలేదా?"

వ్లాడిమిర్ ప్రశాంతంగా జవాబిచ్చాడు.

"శిథిలమయిన గోడ. ఒక్కతోపు. అంతే. అది కూలిపోతుంది!"

జడ్జి, వ్లాడిమర్‌ను చీకటికొట్టులోకి పంపుదామని తలిచాడు. కాని తల్లివచ్చి ఇలా అంది. "నా కొడుకు ప్రవర్తనకు నేను బాధ్యత వహిస్తాను." వ్లాడిమర్‌ను, తనసోదరి అన్నా వున్న కొకుష్కినోకు ప్రవాసం పంపారు. అక్కడ తన పాతస్నేహితుని ఇవాన్‌ను కలిసికొన్నాడు. "పరిస్థితులేమిటి కామ్రేడ్?" అని అడిగాడు. "అసహ్యంగా వున్నాయి. కామ్రేడ్ వొలోడ్యా" అని జవాబిచ్చాడు ఇవాన్. "ఒకానొకరోజున అవి బాగుపడతాయి" అన్నాడు వ్లాడిమర్. "అవును" అన్నాడు ఇవాన్ నవ్వుతూ.

మూడు సంవత్సరాలవరకు వ్లాడిమర్ తన తాతగారి ఇంట్లోనే వున్నాడు. ఆరోజుల్లో, రైతుల మనఃప్రవృత్తిని గ్రహించాడు. వారెలా నివసించుతున్నారో, వారిజీవితం ఎంతకష్ట భూయిష్టమైనదో అతడు చూశాడు. వారు మాటాడే ధోరణి పరిశీలించాడు. వారు మాట్లాడినట్లు మాట్లాడటం నేర్చుకొన్నాడు. అందుచేత, వారి ఈ పరిస్థితులకు కారణం ఏమిటి? తమ పరిస్థితుల్ని బాగుపరచుకోవాలంటె, వారేమిచేయాలి? వీటినిగురించి వారి కర్థమయ్యేలాగా చెప్పగలిగాడు. మూడేండ్ల పిదప, కొకుష్కినో విడిచివెళ్ళడానికి స్వాతంత్ర్యం లభించింది. సెంట్‌పీటర్సుబర్గువెళ్ళి, ప్లీడరు పరీక్షకు కూర్చొని ప్యాసయాడు. లాయర్ అయ్యాడు.

కాని ఎక్కువకాలం ప్రాక్టీస్‌చేయలేదు. అతడు చేయవలసినదింకా చాలా వుంది. కార్మికులకెంతో చేయవలసినపని వుంది వారికోసం తాను పోరాడాలి.

*　　　*　　　*

23 ఏండ్ల యువకుడు, వ్లాడిమర్ ఇల్యిచ్ యుల్యనావ్, జారు ప్రభుత్వ ముఖ్యపట్టణంలో కార్మికులతో తన జీవితయాత్ర సాగించాడు. కార్మిక జీవితం రోజు రోజూ వృద్ధి అవుతున్న కేంద్రపట్టణం పీటర్సు బర్గు. ఫాక్టరీ పొగలతో బూడిదరంగు మయమైన దరిద్ర వీధులలో కామ్రేడ్ ఇల్యిచ్ (ఇపుడతనిని స్నేహితులు ఇలా పిలిచేవారు) కార్మికులతో మాట్లాడేవాడు. అలసట,ఆకలితోనిండిన వారిజీవితాల ప్రతి విషయాన్ని సవిస్తరంగా అతను తెలుసుకొన్నాడు. రైతులేమిచేస్తున్నారో తెలిసికొనేందుకు కొకుష్కినోలోని ఇవాన్‌తో సంబంధం పెట్టుకొన్నాడు. సింబర్స్కులోని పరిస్థితు లెలావున్నాయో తెలిసికొనేందుకు వీరాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు. పీటర్సుబర్గులో, ఒక అనాలంకృతమైన సాధారణ గదిలో, వీరు అల్లడం (నేయ) మొదలెట్టారు ? ఏమిటది. ధనికులు ధరించడానికి ఒక వెచ్చని కోటుగుడ్డా ? కాదు. కోట్లగజాలు నేసిన కార్మికులే వాటిని ధరించేటటువంటి రోజులు వచ్చే స్వాతంత్ర్య వుద్యమానికి ప్లానులు అల్లసాగారు.

విప్లవకారులు, పోలీసులు తెలిసికొనకుండా వుండటావికి, కార్మికులు సులభంగా జ్ఞాపకం పెట్టుకొనేందుకుగాను, చిన్నచిన్న మారుపేర్లు పెట్టుకొనేవారు, వ్లాడిమర్ ఇల్యిచ్ యుల్యనావ్ తనపేరు యన్. లెనిన్ అని పెట్టుకొన్నాడు. కార్మికులు ఒకప్పుడు 'కామ్రేడ్ ఇల్యిచ్' అని, ఒకప్పుడు 'కామ్రేడ్ లెనిన్' అని పిల్చేవారు. ఒకరోజున వీరా సింబర్స్కు నుండి పీటర్సుబర్గు వచ్చింది. ఒక కామ్రేడ్ రహస్యసమావేశం జరుగుచున్న అడుగు గదిలోకి తీసుకుపోయాడు. వీరా గదిలో ప్రవేశించే సమయంలో, ఒక పొట్టి బలిష్టయువకుడు మాటాడుతున్నాడు. "ఓ! అతడు వొలోడ్యా!" ఆయువకుడు తన ఉపన్యాసాన్ని అప్పుడే ముగించుతున్నాడు "కామ్రేడ్స్, మనం ఎల్లప్పుడూ విప్లవధ్యేయాన్ని మనకళ్ళముందు ఉంచుకోవాలి. మనంచేసే ప్రతిపనీ అది నడపాలి. కాని మనం తక్షణకోర్కెలు

కోసంకూడా పోరాడాలి. పనిగంటలు తగ్గించేందుకు, జీవితభృతికి, మంచి జీవిత సౌకర్యాలకు, సోషల్ ఇన్సూరెన్సుకు, అంగరక్షణకు, పోరాడాలి. యువకులకోసం పోరాడుతూ యువకులు మనతోవచ్చేటట్లుచేయాలి. మనం కార్మికులను ఐక్యంగమ్మని, వారిలో వారికిగల విద్వేషపు గోడలను బద్దలు కొట్టాలని, దృఢంగా ఐక్యమయిన పిదప వారందరికీ శత్రువయిన వానిని వదిలించుకోవచ్చునని, మనం చెప్పాలి, కోరాలి."

రహస్య మీటింగులోని కార్మికులు "కామ్రేడ్ లెనిన్ చెప్పేది నిజం" అని అన్నారు. వ్లాడిమర్ ఇల్యిచ్, వీరా రావడం చూశాడు. ఆమె వద్దకు పరుగెత్తి కౌగిలించుకొన్నాడు. "వీరా! నీ రాకవల్ల చాలా సంతోషంగా వున్నాను" అన్నాడు. వీరా కూడా లెనిన్‌ను కౌగలించు కొంది. "నీవు ఇక ఏమాత్రం చిన్న వొలోద్యా కావు. ఇపుడు వ్లాడిమర్ ఇల్యిచ్ లెనిన్‌వు – నాయకుడవు."

* * *

లెనిన్, కార్మికుల దైనిక పోరాటాలను నడిపాడు. లెనిన్ కార్మికులకు నాయకుడు, బోధకుడు. "కార్మికవర్గ స్వాతంత్ర్యం కోసం పోరాడే సమితి" ఒకటి ఏర్పడింది. మెంబర్ల సంఖ్య హెచ్చింది. వీరా, ఆమె తల్లీ, తండ్రీ చేరారు. తన తల్లిదండ్రులు పస్తుపడి మాడకుండా ఉండేందుకుగాను, పట్టణంలో పనిచేయడానికి వచ్చిన ఇవాన్ కూడా చేరాడు.

కార్మికులు ఎంతో జాగ్రతగా ఉండాలి. జారు పోలీసుల నల్లని నీడ ప్రతిచోటా వెంబడించేది. వారు ఎంతో రహస్యంగా పని చేయవలసి యుండేది. వారుచేసేపనిని "అండర్ గ్రౌండ్" పని అని పిలిచేవారు. వాళ్ళకు అచ్చువేసే ప్రెస్ లేదు. పుస్తకాలు కలంతోనో, పెన్సిలుతోనో వ్రాసి, ఒకరి తర్వాత ఒకరికి ఇచ్చుకొనేవారు. ఉత్తరాలు సాంకేతిక పదాలలో వ్రాసుకొనేవారు. రహస్య సందేశాలు రసాయనిక సిరాలతో వ్రాసేవారు. వాటిని ఎలా చదవాలో ఎరిగినవారు తప్ప ఇతరులు వాటిని చదువలేరు.

ఒక కార్మికుల సర్కిల్‌నుండి మరో సర్కిల్‌కు వెళ్లుతున్న లెనిన్ చాలా జాగ్రత్తగా వుండవలసి వచ్చేది. పట్టణంలో కార్మికులుండే

భాగంలో ప్రతి సందూ గొందు కూడా లెనిన్‌కు తెలుసు తన రాక తెలియకుండా వుంచడంలోను, పోలీసు గూఢచారులను తప్పించుకోడం లోను అతడు ప్రవీణత సంపాదించాడు. పట్టణ వెలుపలి భాగంలో ఒక ఇంటిలో రహస్య ముద్రణాలయం నెలకొల్ప బడింది. ఈ ఇల్లు, పొరుగు ఇండ్లలాగానే కన్పించి అనుమానానికి తావు లేకుండా వుండేది. ప్రయివేటు రూమ్‌లో రహస్యంగా ఉన్న ఒక ద్వారం గుండా మాత్రమే అక్కడికి చేరగలరు. రాత్రిళ్ళు, కార్మికులు ప్రెస్‌లో పనిచేసేవారు. వారు సంపాదించిన వార్తలు, కొన్ని రోజులకు అచ్చు కరపత్రాలుగా వేలకు వేలు తయారయ్యేవి. మార్కెట్టుకి వెళ్లుతున్నట్లు వెళ్ళి, స్త్రీలు, బుట్టలో ఆహారం అడుగున ఈ కాగితాలను దాచేవారు. వాటికి పంచి పెట్టడానికిగాను నియమింపబడిన కార్మికుల వద్దకు తీసుకుపొయ్యేవారు.

ఈ ప్రథమ కార్మికుల సర్కిలుల కృషి ఫలించింది. 1895 నవంబరులో, నూతనంగా చైతన్య మొందిన పట్టణ కార్మికుల సమ్మె జరిగింది. ఒక రోజున చక్రాలు తిరిగాయి. చిమ్నీల నుండి పొగ కక్కింది. మరుసటి రోజున కొన్ని చక్రాలు ఆగిపోయాయి. ఆ మరు రోజున మరికొన్ని ఆగాయి. పొగ రావడంలేదు. కొన్ని వేలమంది కార్మికులు పని మానివేశారు.

రహస్య ప్రెస్‌ల నుండి, లెనిన్ వద్దనుంచి కరపత్రాలు వచ్చేవి. ఫ్యాక్టరీ గేట్లవద్ద కుంభవర్షంలాగా కురిసేవి. వాటిని పాడుచేయక ముందే, సమ్మెదారులు వాటిని లాక్కొనేవారు. పోరాట సమితిని తెలిసికొని దానిని నమ్మారు.

ఫ్యాక్టరీ యజమానులు కోపంగా వున్నారు. కార్మికులకు అదనంగా ఒక దమ్మిడి కూడా ఇవ్వమన్నారు. కార్మిక నాయకులను కొట్టి జైళ్ళలో వేశారు. కొందరు పీటర్సుబర్గులో భయంకరమైన చీకటి కొట్లలో పారవేయ బడ్డారు. మరికొందరు, మంచు మైదానాలతో గూడిన సైబీరియాకు ప్రవాసం పంపబడ్డారు. యజమానుల ఉన్మత్త క్రోధాగ్ని నుండి లెనిన్ కూడా తప్పించుకోలేక పోయాడు. అతడు కూడా జైలుకు గురి అయ్యాడు. అక్కడ పుస్తకాలలో పంక్తికీ పంక్తికీ మధ్య సిరాకు

బదులుగా పాలతో కరపత్రాలు వ్రాస్తుండేవాడు. జైలు బయటనున్న కార్మికులకు ఈ పుస్తకాలందేవి. వారు పుస్తకాలను వెచ్చబెట్టేవారు. అక్షరాలు కనిపించేవి. ఈ అక్షరాలే మరుసటి రోజున కరపత్రాల రూపంగా కార్మికులు చదువుకోడానికిగాను వెలువడేవి.

జైలర్‌కు తెలియకుండా వుండేందుకుగాను, రొట్టెలను సిరా బుడ్లుగా చేసేవాడు. దాంట్లోకి సిరా - పాలను - పోసేవాడు. ఎవరయినా తన కొట్టువద్దకు వచ్చినట్లు శబ్దమైతే వాటిని మింగేవాడు. ఒకసారి తన ఉత్తరంలో ఇలా వ్రాశాడు. "నేనివాళ ఆరు సిరాబుడ్లు మ్రింగాను."

ఒక సంవత్సరందాకా లెనిన్ పీటర్సుబర్గ జైలులోనే వున్నాడు. "అతన్ని సైబీరియాకు ప్రవాసం పంపండి!" అని ఆర్డరు వచ్చింది. యురల్స్ ఉన్నత పర్వతాలను దాటి సైబీరియాకు, వేలకొలది మైళ్ళ దూరానికి లెనిన్ ప్రవాస మంపబడ్డాడు.

* * *

మంచుగడ్డల, చలిబాధల నుండి ఖైదీలు తప్పించుకోవాలి. కొందరి ప్రయత్నాలు ఫలించాయి. కొందరు చలికి గడ్డకట్టి కొయ్యబారిపోయి మృత్యువు వాతబడ్డారు. కార్మిక పోరాటాల నుండి దూరంగా వుండటం బాధగానే వున్నా, లెనిన్ పుస్తకాలను అధ్యయనం చేయ మొదలెట్టాడు. కార్మికవర్గం తన యజమానిని కూలద్రోయాలంటే, చాలా నేర్చుకోవలసి వుంది.

త్వరలోనే ఒక స్నేహితురాలు కూడా వచ్చింది. ఆమె "నదెజ్దా క్రుపస్కాయ." ఆమే తర్వాత లెనిన్ భార్య అయింది. లెనిన్, క్రుపస్కాయ ఆమెతల్లీ అందరూ కలిసి వుండేవారు. ఒక్కొక్కసారి 6 ఏండ్ల కుర్రవాడు - మింకా అనేవాడు - వారిని సందర్శించుతుండేవాడు. పెద్ద బొచ్చుటోపీ ధరించి, వెచ్చని చొక్కా తొడుగుకొని, ఇంట్లోకి పరుగెత్తి "ఇదిగో నేను వచ్చాను!" అనేవాడు. అందరూ నవ్వేవారు. క్రుపస్కాయ తల్లి బిస్కత్తులూ, రొట్టెలు పెట్టేది.

లెనిన్, యింకా ఇతర ధైర్యవంతులయిన పురుషులతోను, స్త్రీల తోను ప్రవాసకాలంలో నివసించాడు. చలికాలం రాకముందు – మంచు రాకముందు – (ఐనా నదులు గడ్డకట్టుకుపోతూనే వున్నవి.) లెనిన్ అతని భార్యా నదులవద్దకు వెళ్ళేవారు. ఇక్కడ లెనిన్ తన సోదరుని జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. దూరప్రదేశాలలో పెరిగి నివసించే వస్తువులను పరిశీలించడం సాషా ప్రేమించేవాడు. శుభ్రంగావున్న మంచు క్రింద ప్రతి చిన్నచేపా, ప్రతిరాయీ, తేటతెల్లంగా కన్పించుతున్నాయి. చలి కాలంలో నదులు అడుగంటా గడ్డకట్టుకు పోయినప్పుడు, లెనిన్ "స్కేటింగ్" (మంచుమీద, ఇనుప చక్రాలు తగిలించిన బూట్లతో పరుగెత్తే ఒక ఆట) కు వెళ్ళేవాడు. అతనికాళ్ళక్రింద మంచుపైపొర నలిగిపొయ్యేది. 'స్కేటింగ్' అంటే లెనిన్‌కు మంచి ఇష్టం.

వసంతకాలంలో నదులపైన తిరగాడే పక్షులను (డక్స్). కుందేళ్ళనూ వేటాడేవాడు. చదరంగం (చెస్) ఆడేవాడు, చెస్‌లో ఎంతమునిగి పోయాడంటే ఒకరోజున నిద్రలో బిగ్గరగా ఇలా కలవరించాడు. "ఇక్కడ అతడు నైట్‌ను పెడితే నేను అక్కడ రూక్‌ను పెడతాను!"

ఇంతదూరాన ఉండికూడా. లెనిన్ పరిస్థితులను చాల జాగ్రత్తగా పరిశీలించేవాడు. అతడు చాల చాల వ్యాసాలు వ్రాశాడు. రష్యన్ కార్మి కులు జాగ్రత్తగాను, ఆతృతతోను, వాటిని చదివేవారు. లెనిన్ చెప్పే మాటలు వారికి తిండీ, నీరుగా వుండేవి. ఆ మాటలు నిజమైనవి. తెలివైనవి. కార్మికుల కర్షకుల జీవితం బాగుచేయడానికిగాను నిరంకుశ జారును కూలద్రోయడానికి ఎలా అర్గనైజ్ చేయాలో, ఎలా ఐక్యమొనర్చాలో తెలియజేసి పోరాటానికి దోవతీసే మాటలవి. కార్మికులు తమ నాయ కుడు లెనినేనని గ్రహించారు.

కాని లెనిన్ తిరిగి పోరాటంలోకి దుమకాలని వాంఛించాడు. జారు అతన్ని పోరాటంలో లేకుండా చేయాలని కోరుతున్నాడు. కార్మికులకు ఎంతోదూరంగా లెనిన్‌ను వుంచాలని జారు కోరిక.

జారు, లెనిన్‌ను శాశ్వతంగా దూరంగా వుంచలేకపోయాడు. మూడు సంవత్సరాలు సైబీరియా ప్రవాసానంతరం, లెనిన్ ఒక మంచుమీద

నడిపే బండినెక్కి. యురల్ పర్వతాలను దాటి రష్యాలోకి వెళ్లాడు. రష్యాలో అతడు చదరంగం (చెస్) ఆడటానికి వ్యవధిలేదు. "చెస్ విన్ను పట్టుకొని, నీ పనికి అడ్డంకి కలిగిస్తుంది" అనుకొని మానేశాడు.

* * *

లెనిన్ పీటర్సుబర్గు రాలేకపోయాడు. జారు పోలీసులు అతన్ని మళ్లా అరెస్టు చేయవచ్చు. అందుకని దగ్గరగావుండే ఒక పట్టణానికి చేరుకున్నాడు.

పీటర్సుబర్గులో పరిస్థితులు త్వరత్వరగా మారిపోతున్నాయి. వీరా, బట్టలునేసే మిల్లులలోను, ఇతర మిల్లులలోను, ఫ్యాక్టరీలోను, కార్మికులు రహస్య సమావేశాలు జరుపుతున్నారు. దేశమంతటా, మాస్కోలో, యురల్‌పర్వతాలలో - మిల్లులలో - గనులలో - వాల్గానది ఒడ్డునవున్న పెద్దపెద్ద పారిశ్రామిక పట్టణాలలో కార్మికులు ఆర్గనైజ్ కావడం మొదలెట్టారు. వారు కార్మికులకొక పార్టీని ఏర్పరిచారు. దానిని రష్యా సోషల్ డెమాక్రటిక్ పార్టీ అనేవారు.

దేశంలో దూరదూరానవున్నా అనేకచోట్ల అనేక విషయాలు జరుగుచున్నాయి. దేశమంతటా ఏమిజరుగుచున్నదో చెప్పేది ఒకటి కార్మికులకు కావాలి. వారు టెలిగ్రాఫ్‌ను ఉపయోగించలేరు. ఉత్తరాలన్నీ గూఢచారులు విప్పిచూస్తున్నారు. ఒక ప్రెస్ పెట్టి పత్రికను నడుపలేరు. ఏ మూలపెట్టినా, జారు పోలీసుల సోదాలకు గురికాకుండా ఉండటంకష్టం

కార్మికులు విదేశాలకువెళ్ళి వారి పత్రికను స్థాపించుకోవాలి. అందుకని లెనిన్ మళ్లా క్రొత్త దేశాలకు ప్రయాణమయ్యాడు. పోలెండునుదాటి, జర్మనీ వెళ్ళాడు. అచ్చట ఇస్ట్రా (అంటే స్పార్క్ అగ్ని కణం) మొదటి సంచిక వెలువడింది. ప్రతి సంచికలోను ఈ వాక్యం వుండేది. "కణము నుండి. జ్వాల లేస్తుంది." ఏమి జ్వాల? విప్లవజ్వాల.

కార్మికులు పత్రికను చదివి తమ జీవితాలను గురించిన సత్యాన్ని కనుగొన్నారు. "ఇస్ట్రా"లో ఒక వ్యాసాన్ని తన తోడి కార్మికునకు చూపిస్తూ వీరా ఇలా అంది. "ఇదిగో లెనిన్ ఏం వ్రాస్తున్నాడో చూడు. చిన్నచిన్న విడివిడిగానుండే క్లబ్బులతోను, చిన్న ముఠాలతోను మనం

సంతృప్తిపడగూడదనీ, మనము ముఠాలను పెద్దవిచేసి, వాటిని కలిపి జారుయొక్క, యజమానులయొక్క నిరంకుశతత్వంతో పోరాడటానికి బ్రహ్మాండమైన అర్గనైజేషన్‌గా చేయాలని లెనిన్ అంటున్నాడు." లెనిన్ ఇక్కడో కార్మికునకూ, అక్కడో కార్మికునకూ ఉత్తరాలు వ్రాస్తూ వుండేవాడు. ఏం జరుగుతోంది? వాళ్ళెలా కాలం గడుపుతున్నారు? మొదలైన ప్రశ్నలడగడమేగాక, వారికి సలహాలిచ్చేవాడు. చాల మంది కార్మికులు అతనికి ఉత్తరాలు వ్రాసేవారు. అతనిని చూడటానికి రష్యా నుండి వెళ్ళేవారు. ఎక్కడ, ఎప్పుడు, ఎందుకు, ఏమిచెయ్యాలో లెనిన్ వారికి నేర్పేవాడు. కార్మికులు రష్యాకు తిరిగివచ్చి తమ బోధకుని బోధలను ఆచరణలో పెట్టేవారు. కార్మికులలో చైతన్యం హెచ్చసాగింది.

* * *

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమైంది. ఇవాన్ తండ్రి పల్లెటూరిలో ముసలివాడైపోతున్నాడు. ఇవాన్ తన తలిదండ్రుల వద్దకు తిరిగి వెళ్ళవలసివచ్చింది. భూస్వామికోసం ఇవాన్ పనిచేసేవాడు. భూమిని దున్నేవాడు, బానిసత్వం చేసేవాడు, ఇదివరకటిలాగానే జీవితం కష్టంగా వుంది. అలాంటి సమయంలో అకస్మాత్తుగా యుద్ధం ప్రకటించబడింది.

సైబీరియా మైదానం అవతల. దాదాపు రష్యా అంత పెద్ద దేశం మరొకటివుంది. ఆ దేశంలో పెద్దపెద్దనదులు ప్రవహించుతాయి. ఆదేశపు భూమిక్రింద బొగ్గుగనులు, లోహపుగనులు వున్నాయి. ఆ గనులలో కార్మికులు చెమటోడ్చి బానిసత్వంచేసి ధనికుల్ని మరింత ధనికుల్నిగా చేస్తున్నారు. ఆ దేశ తీరాన్ని పసిఫిక్ మహాసముద్ర ప్రశాంత జలవాహినులు తాకుతూపోయాయి. అది చైనా.

రష్యా పెద్ద దేశం అయినా చలికాలంలో నౌకలు ప్రయాణం చేయగలిగిన రేవులు దానికిలేవు. దాని రేవులన్నీ మంచుతోను, మంచుగడ్డలలోను నిండివుంటాయి. కాని చైనాకు మంచు గడ్డకట్టని ఓడరేవు ఒకటివుంది. అది "పోర్టు ఆర్థర్" రేవు. చైనా బలహీనదేశం ఎంత సులభం కాజేయడానికి!

చైనాలో తనకు పోటీలేకుండా ఉండాలనికోరే మరో దేశం వుంది. అది జపాను. జపాను వర్తకుల హృదయాలు, కళ్ళు, వారి పాకెట్ బుక్కులు అన్నీ చైనా భూమి అడుగునవున్న సంపదపైన వుండేవి.

రష్యా, జపానుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. పొట్టి పసుపు మనుష్యులు (జపానీయులు) రైతుల అవుల్నీ, నాగళ్లను దోచుకొన డానికి బయలుదేరారని రష్యన్ రైతులకు చెప్పబడింది. ఎప్పుడుగూడా తమ గ్రామాలనుండి కదలనివ్వని రైతులను, పసిఫిక్ మహా సముద్ర తీరానికి తీసుకపోయారు. వారి చేతులలో బలవంతంగా తుపాకులను కుక్కారు. పసుపు కార్మికులను (జపానీయులను) కాల్చి చంపమని చెప్పారు. ఎందుకు? రష్యన్ వర్తకులకు, తమ సరుకులను రవాణా చేసుకునేందుకు ఒక ఓడరేవు కావాలి గనుక.

కార్మికులనుండీ, కర్షకుల నుండీ లాగిన, 100 కోట్ల రూబుల్సును రష్యన్ పెట్టుబడిదారులు ఖర్చుచేశారు. 2 లక్షలమంది కార్మికులు, మరణించడమో, క్షతగాత్రులవడమో జరిగింది. దాదాపు అంతమంది జపాను కార్మికులుగూడా గాయపడడమూ, మరణించడమూ సంభవించింది.

ధనిక భూస్వాములు తమ పల్లెటూరి రాజభవనాలలో టీ త్రాగుతూ. రష్యా గనుకజయించితే తమకువచ్చే పెద్దలాభాలను గురించి కలలుగంటున్నారు. యుద్ధానికి పంపబడని రైతులచే మరింత కఠినంగా పని చేయించారు. ముసలివాళ్ళు, ముసలమ్మలు, పిల్లలతో సహా పొలాలకు తరుమబడ్డారు. పొలంలో వారిచే పని చేయించారు. భూస్వామిగాని, మిల్లు యజమానిగాని, జారుగాని త్వరలో ఏమి సంభవించనున్నదో ఏమాత్రమూ ఊహించలేదు.

యుద్ధాలలో అలసిపోయిన సైనికులు తిరిగి వస్తున్నారు. తమ ఇండ్లవద్ద పరిస్థితులు మరింత ఘోరంగా వుండడం చూచారు.

పీటర్స్‌బర్గ్ కార్మికులిక ఏమాత్రమూ సహించలేకపోయారు. క్షామ నివారణకు జారును అడుగుదామని అనుకున్నారు. తమ "క్రాస్" (శిలువ)లనూ, పవిత్ర విగ్రహాలనూ పోగుచేశారు. "చిన్న తండ్రి

(రష్యాలో పెద్దతండ్రి క్రీస్తు. చిన్నతండ్రి చక్రవర్తి) రెండవ నికలస్ వద్దకు—జార్ వద్దకు—మత గేయాలు పాడుకుంటూ వెళ్ళారు.

వారిని తుపాకి గుండ్లు ఆహ్వానించాయి. ఆ రోజున 1905 జనవరి 22 వ తేదీన—తిండి అడుగుదామని వచ్చిన 200 మంది కార్మికులు చంపబడ్డారు. వెయ్యిమందికి పైగా గాయపడ్డారు. ఇక యెల్లప్పుడూ జార్ తమకు శత్రువేనని కార్మికులిపుడు గ్రహించారు. భూస్వాములకూ, పెట్టుబడిదారులకు స్నేహితుడైన జారును సహాయం చేయమని ఇక ఎన్నడూ ప్రార్థించరు. తమ పోరాటాల ద్వారానే తమ పరిస్థితులను బాగుచేసికొంటారు.

రష్యాకు దూరంగావున్న యూరప్‌లోవుండే లెనిన్, కార్మికులేమి చేయాలో చెప్పాడు. లెనిన్ చెప్పే మాటలు అర్థంగల మాటలు గాబట్టి వారి సందేహాలను తీర్చాయి. వారి పట్టుదలను గట్టిపరిచాయి. లెనిన్ వారిలో ఒకడు. వారి నాయకుడు. వారి మనస్సులలో ఉండేదానినే బిగ్గరగా లెనిన్ వాళ్ళకు చెప్పాడు. అలా వారు తలచినా, వారి భావాలను ఆచరణలోకి మార్చాలి. లెనిన్ వాటిని ఆచరణలోకి మార్చాడు. "ఆర్గనైజ్ కండి! సమ్మె చేయండి! ప్రదర్శనాలు గావించండి! జారును కూలదోయండి!" అని అన్నాడు. కార్మికుల ఆలోచనలు గూడా సరిగ్గా ఇవే. తమ స్వంత భావాలివే. తమ నాయకుడు - లెనిన్ - నోటిద్వారా విన్నారు. తమ నాయకులు - లెనిన్ మాటలద్వారా తమ స్వంత హృదయాలనే విన్నారు. వారు అర్థంచేసికొన్నారు. దేశమంతా పీడించేవారికి వ్యతిరేకంగా కదల నారంభించింది.

పట్టణాలలో కార్మికులు, తమ దౌర్భాగ్య గృహాలనుండి బయటకు వచ్చి ముఖ్య వీధులలో యెర్రజెండాలతో ప్రదర్శనాలు జరిపారు. ఈసారి శిలువ (క్రాస్)లు లేవు. మతగేయాలు లేవు. పతాకాలమీద యిలా వ్రాశారు. "జారు నశించుగాక—ప్రపంచ కార్మికులారా! ఏకంగండి!" గుంపులలో అంతర్జాతీయ గీతం వినబడుతోంది.

"ఆకలి మంటచే మలమల మాడే
అనాధులందరు లేవండోయ్!

మంచి ప్రపంచము రానున్నదీ
మన కందరకు లేవండోయ్ !"

పల్లెలలో రైతులుకూడా, ఇక ఏ మాత్రము బాధలను సహించలేక పోయారు. ఇవాన్, తన తల్లిదండ్రులతో ఇలా అన్నాడు. "మనం భూస్వామిని తరిమివేయాలి. మూడు గ్రామాల ప్రజలందరికీ వున్న భూమికంటె ఎక్కువ భూమి వుంది అతనికి. అయినా ఒక్కరోజైనా నాగలి పట్టుకొన్న పాపానపోలేదు. మనం పంట పండిస్తున్నాం. అతడూ, అతని పెళ్ళామూ బలపడానికి, ధనికు లవడానికి కారణం మనం. మన పిల్లలు ఊపిరిలేకుండా ఆకలితో చస్తున్నారు;"

ఇవానూ, ఆ గ్రామంలోని ఇతర రైతులూ, తమ పారలూ, పలుగులూ తీసుకొని భూస్వామి పెద్ద తెల్లభవనంవద్దకు వెళ్ళారు. ఈసారి తలుపు తట్టారు. అంత భూమిని గల్గియున్నందుకుగాను భూస్వామికి గౌరవ పురస్కారంగా టోపీలుతీసి నమస్కరించవద్దూ ? లేదు. నమస్కరించలేదు. రైతులు ఎకాయకిని ఇంటి ఆవరణలోకి వచ్చి భవనంలోకి ప్రవేశించారు. వందలకొలది సంవత్సరాలుగా తాము దున్నుచున్న-తాము దున్నిన-భూమిని- తమ కిమ్మన్నారు. తాము పండిచిన ధాన్యం తమ కిమ్మన్నారు.

భూస్వామి, జారు పోలీసుల చేతులలో తాము అనుభవించిన బాధలతో గూడిన దీర్ఘ సంవత్సరాలను వారు జ్ఞప్తివుంచుకున్నారు. వారు క్రోధంతో, ద్వేషంతో ఉడికిపోయారు. ఈసారి, వారి పారలనూ, కొడవళ్ళనూ, భూమి బాగుచేయడానికీ, కోత కోయడానికీ గాదు ఎత్తింది. తాము పండించిన పంటను ఈయ తిరస్కరించిన భూస్వామిపైకి క్రోధంతో ఉడికిపోతూ ఎత్తారు.

భూస్వామి భయపడ్డాడు. బండికి గుర్రాలనుకట్టి, పెళ్ళాం బిడ్డలతో అంతకుముందే పారిపోయాడు.

రైతులు భూస్వామి పొలాలను లాక్కొన్నారు. పిల్లలు భూస్వామి తోటలో ఆడుకొన్నారు. లెనిన్ సందేశం పల్లెటూళ్ళకు కూడా చేరింది.

పట్టణాలలో అతని సలహాను కార్మికులు పాటించినట్లే, పల్లెలలో రైతులు అతని సలహాను పాటించుతున్నారు.

కాని ప్రతి గ్రామంలోనూ ఇలా జరగలేదు. అనేక గ్రామాలలో రైతులింకా భయపడుతున్నారు. గ్రామాలు దూరదూరంగా ఉండటం వలన రైతులు కలిసిలేరు. వారు ఐక్యంగా నిలబడలేదు.

భూస్వాములు జార్‌ను సహాయపడమని కోరారు. జార్, తన సైనిక నాయకులను, రైతులను తుపాకిగుండ్ల కెరచేయమని ఆజ్ఞ ఇచ్చాడు. కొసక్ సైనికులు, గ్రామ వీధులలో రైతులను కొరడాలతో అటూ ఇటూ బాదుకుంటూ, తుపాకులతో కాల్చుకుంటూ స్వారీచేశారు.

రైతులకు తుపాకులు లేవు. ఆత్మరక్షణ చేసికోలేకపోయారు. తమ తమ ధనిక ఎస్టేట్లకు భూస్వాములు త్వరలోనే మళ్ళా చేరుకొన్నారు.

కాని, రైతులిప్పుడు, తాముకూడా బలం గలవారమే నని తెలుసుకొన్నారు. భూస్వామి నిరంకుశత్వానికి అంత సులభంగా ఇప్పుడు లొంగడు. ఇవాన్ గుడిసెలో రాత్రిళ్ళు చేరుతారు. మీటింగులు చేస్తారు. ఈ మీటింగులనుండే రైతు సంఘాలు లేచాయి. తాము దున్నే భూమిని తాము పొందాలి. అందుకు వారు పోరాటాన్ని కొనసాగించ నిశ్చయించుకొన్నారు.

పట్టణాలలో పోరాటం మరింత భయంకరంగా సాగింది. దేశమంతటా నలుమూలలా సమ్మెలు విజృంభించాయి. లెనిన్ కార్మికులను సార్వజనిక సమ్మెను ప్రకటించమన్నాడు. సార్వజనిక సమ్మె జరిగింది. ఒక పట్టణంనుండి మరోపట్టణానికి, గంగా ప్రవంతిలా వ్యాపించింది. సైనికులు కార్మికులపై తుపాకీలు ప్రేల్చ నిరాకరించారు. పైగా కార్మికులను తమ సోదరులలాగా అభినందింపసాగారు. నావికులు తమ ఆఫీసర్లపై తిరుగబడి సమ్మె చేశారు.

జారు, పెద్దభూస్వాములూ పెట్టుబడిదారులూ గాభరాపడిపోయారు. "మనం కొన్ని వాగ్దానాలు చేసి కార్మికులను బుట్టలో వేద్దాం" అన్నారు. "అప్పుడు శాంతిపడవచ్చు" అన్నారు. జారు ఒక ప్రణాళిక ప్రకటించాడు.

వోటు నిచ్చేహక్కూ, మీటింగు పెట్టుకొనేహక్కూ, తమ యిష్టం వచ్చి నట్లు పేపర్లో వ్రాసుకొనేహక్కూ, చివరకు కాంగ్రెసును ఎన్నుకొనే హక్కును కూడా వాగ్దానంచేశాడు. ఇది విప్లవానికి ప్రథమ విజయం.

కాని జారు వాగ్దానాలకు లెనిన్ బుట్టలోపడలేదు. "జారు వాగ్దానాలను నమ్మకండి. మీరింకా అనేక యుద్ధాలు చేయాలి. ఆయుధాలు సేకరించండి. సైనికుల్ని మీవైపుకు లాగండి. రైతులను నడపండి. సార్వజనికసమ్మెను కొనసాగించండి." అంటూ లెనిన్ చెప్పిన స్పష్టమైన సత్యమైన వచనాలు దుందుభిలా మ్రోగాయి.

లెనిన్, రష్యాకు దూరంగా చాలాకాలం వుండలేకపోయాడు. కార్మికులను నడపటానికి పీటర్సుబర్గు వచ్చాడు. ఫ్యాక్టరీలను మూసివేసి జారుకు సహాయపడుతున్న మిల్లుయజమానులతో పోరాడవలసిందని చెప్పాడు. "మిమ్మల్ని పస్తుపడుకొనేటట్లు చేయాలని వాళ్లు ప్రయత్నిస్తున్నారు" "రష్యాలోని కార్మికులందరూ కలిసి సమ్మెచేయాలి!" అన్నాడు. కలిసి సుమా!

జారు చర్చిల (క్రీస్తుదేవాలయాల) గోపురాలు ఎండలో మెరుస్తున్న మాస్కోలో, సమ్మె భయంకరంగా వుంది. ఎంతో సందడిగా వుండే పెద్దపట్నం, ఖాళీచేసిన గ్రామంలా వుంది.

ఇంటియావరణలలో మిత్రుల కులాసాకబుర్లులేవు. లారీలరణగొణ ధ్వని, హటాత్తుగా ముందేమి జరుగుతుందోనని భయాన్ని కలుగజేసింది. కిటికీలవద్ద తొంగిచూచేటట్లు చేసింది. రెజిమెంటు సోల్జర్లు కవాతుచేసి కొంటూ పోవడంచూచి, మూసిన తలుపుల సందులనుండి తిట్టడం సాగించారు. కాని తలుపులు తెరవలేదు, కిటికీలు తెరవలేదు, పట్టణమంతా ఎదురుచూస్తోంది, ఎదురుచూస్తోంది!

కార్మికులు బయటికి వచ్చారు—పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు బయలుదేరాటు. చొక్కాలెగురుతున్నాయి. కండ్లలో విజయసూచక దృక్కు కన్పించుతోంది. "కష్టపడి యీ నగరమంతా కట్టినది మనమే గదా!" అని అరిచారు. "ఈ పట్టణం మనదై తీరుతుంది" అన్నారు. వీధులలో త్వర త్వరగా బేరికేడ్ల (Barricades) (కార్మికులు పోరా

టంలో, ఆత్మ సంరక్షణం కోసం కనపడిన ప్రతి వస్తువుతోను కట్టుకొనే అడ్డగోడలు) నిర్మించారు. జారు పోలీసులపైన కార్మికుల తుపాకులు గింగురుమన్నాయి. కాని జారు చక్రవర్తి కోసక్ సైన్యాల పెద్ద పెద్ద మరఫిరంగుల చెవులు బ్రద్దలుకొట్టే భీకరరవంలో, కార్మికుల తుపాకుల ధ్వనులు మునిగిపోయాయి.

జారు బయపడి పీటర్సుబర్గునుండి అన్నిటిలో మంచి సైన్యాలను ఏరి పంపాడు. గ్రామసీమలగుండా, మాస్కో-పైన మృత్యువర్షాన్ని కురిపించడానికి అన్నిటికన్న వేగంగా పరుగెత్తే రైలు తుపానులా వెళ్ళింది. జారు కోసక్ సైన్యాలు వీధులగుండా స్వారిచేశాయి. వారి తుపాకులు గింగురుమన్నాయి. పట్టణం అంతా ఉక్కిరిబిక్కిరైపోయింది. వెయ్యి మంది కార్మికులూ, 86 గురు పిల్లలూ గాయపడ్డారు. కార్మికనాయకులు అనేకమంది జైలుకు పంపబడ్డారు. కార్మికులేగనుక లెనిన్ తప్పించుకోడంలో సహాయపడక పోయినట్లయితే, లెనిన్‌కూడా జైలుకు పోవలసి వచ్చేది.

అనేకమంది నాయకులు నిరాశచేసికొన్నారు. ఇక దీనితో ఆఖరు అని అనుకొన్నారు. కాని, ఇది అంతముకాదనీ, ప్రారంభమనీ లెనిన్‌కు తెలుసు. రష్యాకార్మికుల యీ ప్రథమ సాయుధ తిరుగుబాటును, జారు పోలీసుల తుపాకులు అణచివేశాయి. వారు ఓడిపోయారు. కాని వారు నశించలేదు.

వీధులలో ఇపుడు ఇక 'బారికేడ్లు' లేవు. దీని అర్థం విప్లవోద్యమం ఇంతటితో చచ్చిపోయిందనికాదు. లెనిన్ కార్మికులతో ఇలా అన్నాడు: "విప్లవం" ఊపిరి పీల్చుకోవడానికి (విశ్రాంతి తీసికోడానికి) ఆగిపోయిన రోజులలో, మరల నూతన విప్లవం లేవదీయడానికి పరిస్థితులను తయారు చేయాలి. కార్మికులారా! "ముందుకు పోవడానికి తయారుగండి."

పీటర్సుబర్గు సరిహద్దుగుండా లెనిన్ ఫిన్లండుకు పోయాడు. కార్మికులకు అక్కడికిపోయి అతనితో మాట్లాడటం సులభం. ఆ విధంగా కార్మికులేమి అనుకొంటున్నారో, ఏమిచేస్తున్నారో లెనిన్‌కు తెలుస్తుంది.

వీరా, ఆమె తండ్రి, లెనిన్‌వద్దకు వెళ్ళుతుండేవారు. రష్యాలో ఏమి జరుగుతున్నదో వారు తెలియజేస్తుండేవారు. అయినా, జారు పోలీసులు అతన్ని వెంబడించుతున్నారు. లెనిన్ ఇంకా దూరంగా-స్టాక్‌హోమ్‌కు పోవాలి. బోట్లన్నిటినీ కాపలాగాస్తున్నారు. లెనిన్ ఏమి చెయ్యాలి!

ఒక ఫిన్నిష్ కామ్రేడ్ ఇలా చెప్పాడు. "మరో దీవిదగ్గర మీకు బోటు దొరుకుతుంది. అక్కడికి పొండి."

బాల్టిక్ సముద్రంలో ఆ దీవి కొన్నిమైళ్ళలోపలే వుంది. వేసవిలో అయితే, ఏ పల్లెకారి అయినా లెవిన్‌ను తీసుకుపోయేవాడే. కాని ఇపుడు నీరు పై భాగమంతా గడ్డకట్టుకుపోయింది. అది డిసెంబరు మాసమైనా కొన్నిచోట్ల మంచు గట్టిగాలేదు. సముద్రం దాటే ప్రయత్నంలో తన ప్రాణం పోగొట్టుకోడానికి ఎవడూ సాహసించడు. కాని లెనిన్‌కు ఒక క్షణం ఆలస్యమైందంటే ఒక మహా ఆపద-మృత్యువే-రావచ్చు.

సముద్రతీరాన పెరిగిన ఇద్దరు ఫిన్నిష్ రైతులు, తాము సహాయంగా వస్తామని సిద్ధమయారు. ఒకరాత్రి యీ ముగ్గురూ ప్రయాణమయ్యారు. త్వరత్వరగా నడిచారు. వాళ్ళ పాదాలక్రింద మంచు నలిగిపోతోంది. అంతా బాగానేవున్నట్లువుండి హఠాత్తుగా మంచు కదలనారంభించింది. ఇంకో క్షణంలో మంచుకరిగి మునిగిపోతారు. రక్షించమని కేకలువేసినా అక్కడ దిక్కూ-మొక్కూ లేదు.

"ఛీ! ఛీ! ఎలాంటి పిచ్చిచావు చావవలసివస్తోంది" అనుకొన్నాడు లెవిన్.

ఎలాగోవారు గట్టి మంచుగడ్డపైన కాళ్లు వేయగలిగారు. అదికూడా సరియైన సమయంలో వేయగల్గారు. మళ్లా, అతిజాగ్రత్తగా నడువనారంభించారు. ప్రతి అడుగూ మృత్యుగహ్వరంలోకి ఈడ్వవచ్చు. కాని అలాంటిదేమీ సంభవించలేదు. లెనిన్ ఆ ప్రదేశానికి సురక్షితంగాచేరాడు. అక్కడనుండి స్టాక్‌హోమ్‌కు వెళ్లాడు. స్టాక్ హోంనుండి స్విజర్లండుకు పోయాడు.

రష్యాకు అంతదూరంగా వుండటం లెనిన్‌కు ఇష్టంలేదు. ఫ్యాక్టరీ కూలీలతో, వ్యవసాయిక రైతులతో ఉండిపోవాలని అతని వాంఛ.

స్విజర్లండుకు చేరగానే లెనిన్ ఇలా అన్నాడు. "నే నిక్కడకు పాతిపెట్ట బడటానికి వచ్చానా? అనిపిస్తోంది." మళ్ళా 9 సంవత్సరాలవరకుగాని పీటర్సుబర్గు వెళ్ళలేదు.

ఈలోగా, రష్యాలో పరిస్థితులు నిరాశాజనకంగా వున్నాయి. జారు ప్రభుత్వం పగతీర్చుకొంటోంది. అత్యంత విప్లవయోధులైన కార్మికు లను, కర్షకులను జైళ్ళలో కుక్కుతున్నారు. సైబీరియాకు ప్రవాసం పంపుతున్నారు. కాని లెనిన్ రాత్రింబవళ్ళూ పనిచేశాడు. మరో విప్ల వానికి కార్మికులను లెనిన్ తయారుచేస్తున్నాడు. లెనిన్ ఆర్గనైజ్ చేసిన స్కూళ్ళకు రష్యన్ కార్మికులు వచ్చేవారు. అతడు బోధించిన పాఠా లను నేర్చుకొని రష్యాకు తిరిగి వెళ్ళేవారు. అది తుపాను ముందలి ప్రశాంతత. ఈసారి కార్మిక కర్షకులను నడిపే గట్టి విప్లవ పార్టీని నిర్మించుతున్నారు. దానిని బోల్షివిక్ పార్టీ అనేవారు. దాని నాయకుడు లెనిన్.

ఆ ప్రశాంతత భగ్నమవడానికి యెంతోకాలం పట్టలేదు. ప్రతి కార్మికుని గుండె చీల్చుకుపోయే, అతని రక్తం వుడికిపోయే విషయం ఒకటి సంభవించింది.

చాలాదూరాన – సైబీరియాలో – ఒక తుపాకి పేలిన ధ్వని విన వచ్చింది. ఒకటి, రెండు, మూడు – వంద – రెండువందల గుండ్లు పేలిన ధ్వని గాలిలో దూసుకుపోయింది. ప్రతి గుండుకు ఒక సమ్మెదారుడు రక్తస్రవంతులలో మునిగి చనిపోయాడు. రెండు వందలమంది మళ్ళా తలయెత్తకుండా పడిపోయారు. అది 1912 వేసవిలో జరిగింది. ఈ భయంకర ఘటన, ఎక్కడో దూరానవున్న "లెనా" బంగారు గనులలో జరిగినా, దేశమంతటా కార్మికుల హృదయాలలో అది ప్రతిధ్వనించింది. అది కార్మికవర్గానికి శంఖారావం – కార్మికులా శంఖారావానికి లేచారు. జవాబు చెప్పారు. "లెనా" గనులలో చనిపోయిన ప్రతి ఒక్క కార్మికు నకూ, వేయేసి కార్మికులు రష్యా అంతటా ఫ్యాక్టరీల నుండి, మిల్లుల నుండి బయటికి వచ్చి సమ్మె చేశారు. దేశాన్నంతా అసమ్మతి వెల్లువ అలుముకొంది.

అన్ని ఫ్యాక్టరీలలోను కార్మికులు కోపోద్రిక్తులయ్యారు. వీరా, ఈ హత్యాకాండను విన్నది. విని తన ఫ్యాక్టరీ కార్మికులకు చెప్పింది. "లెనా" బంగారు గనులలో 200 మంది కార్మికులను కాల్చి చంపారు" అన్నది వీరా. ఆమె ముఖం ముడతలు పడినా, ఆమెతల నెరసిన వెంట్రుకలతో మిశ్రమమైయున్నా, ఆమె కళ్లు నిప్పులు కక్కుతున్నాయి.

వీరా అరచింది "వాళ్ళు కోరిందల్లా తిండి. వాళ్ళ పిల్లలు ఆకలితో చస్తున్నారు." "అవును, మనపిల్లలలాగానే" అన్నాడు మరో కార్మికుడు.

వీరా ఇంకా ఇలా చెప్పింది. "రెండువందలమంది సమ్మెచేశారు. వారు ఆకలితో చస్తున్నారు. వారిని తుపాకిగుండ్లు ఆహ్వానించాయి. మనం కూడా ఆకలితో వున్నాం. మన యజమానులుకూడా మనల్ని చంపడానికి ప్రయత్నించుతారు. కాని మనం తుపాకి గుండుకు గుండు బదులుచెబుతాం. మనం పోరాడుదాం. మనం జయించుదాం. లెనా బంగారు గనులలో పోరాడి చనిపోయిన మన సోదరులు వృధాగా చావలేదు.

కార్మికులు ఫ్యాక్టరీలనుండి బయటికి వచ్చేశారు. మిల్లు యజమానులు, మతాధిపతులు, జారు, కోసక్ సైన్యాలు, వారిని తిరిగి రమ్మని ఆజ్ఞాపించారు. కాని కార్మికులు తిరస్కరించారు. వీధులలో "బారికేడ్సు" నిర్మించారు. "ఆకలితో చచ్చేకన్నా, పోరాడుతూ చావడం మెరుగు" అన్నారు వాళ్ళు.

విప్లవం మళ్ళా ప్రాణం పోసుకుంటున్నదని లెనిన్ గ్రహించాడు. 1905 లోని అపజయం నుండి కార్మికులు తేరుకుంటున్నారు. లెనిన్ కార్మికులను ప్రోత్సహించాడు. అతడిలా అన్నాడు. "ఇది నూతన అధ్యాయం. ఒక్క దెబ్బతో ఈసారి జారునూ, పెట్టుబడిదారులనూ మనం ఓడించాలి."

* * *

ఒక ప్రక్క పీటర్సుబర్గులో కార్మిక పోరాటాలు యిలా జరుగుతుంటే, మరోప్రక్క ప్రపంచమంతా మహాభయంకర యుద్ధంలో

మునగ నున్నది. *బెర్లినులోని "హెర్ మార్కు" గారు, పారిస్‌లోని "యం. ఫ్రాంకు"గారు, లండనులోని "లార్డుపౌండు"గారు, యునైటెడ్ స్టేట్సు (అమెరికా)లోని "మిష్టర్ డాలర్" గారు - అందరూ - చౌక కూలీ, మార్కెట్లూ, బంగారమూ, కావాలన్నారు.

అప్పటికే ఆఫ్రికా ఆసియాలలోని చాలా భాగాలు వారి కత్తులచే చీల్చబడ్డాయి. కాని యింకా చాలా భూమి జయించవలసింది వుంది. ప్రపంచములో యింకా చాలా భాగాలలో కార్మికులను బానిసలు గావింప వలసివుంది.

ప్రపంచములోని సూర్యుని యెండలో నల్లజాతి పిల్లలు ఆడుకొనే కొన్ని ప్రదేశాలు వున్నాయి. వాటిలో నూనె యెక్కువ దొరుకుతుంది; మరికొన్నిచోట్ల, పసుపురంగు బాలురూ బాలికలూ పనిచేసే పొలాల అడుగున బొగ్గుగనులున్నాయి. "నల్లకార్మికులు మనకు నూనె త్రవ్వి పెడతారు. బొగ్గుగనులలో పసుపురంగు కార్మికులచే పనిచేయిద్దాం" అని బిరుసుపాటి తెల్లకాలర్లు ధరించిన పెద్దపెద్ద వర్తకులు అరిచారు. కాని యం. ఫ్రాంకు, లార్డు పౌండు, మిష్టర్ డాలర్, కోరిన బొగ్గు గనులనే, నూనెగనులనే, హెర్ మార్కుకూడా కావాలన్నాడు. అందు చేత 1914 వేసవిలో వాళ్లు యుద్ధంలో దిగారు.

వాస్తవంలో వాళ్ళే యుద్ధభూమికి వెళ్ళలేదు. వాళ్ళు తమ ఆఫీసులలో పంకాల క్రింద కూర్చున్నారు. తమ సైనికుల్ని లెక్కవేశారు. తుపాకుల్ని లెక్కించారు. యుద్ధం అయిపోయిన తర్వాత తమ నూనె గనులనూ, బొగ్గుగనులనూ ఎక్కడ తవ్వాలో గుర్తుగా మ్యాప్‌మీద సూదులు గుచ్చారు. వారు కార్మికులను ఒకరి గొంతుకలు ఒకరిని కోసుకోమని పంపారు. తమకోసం వాళ్ళని యుద్ధం చేయమని పంపారు. యుద్ధం అంతా ముగిసేసరికి 38,000,000 మంది కార్మికులు చనిపోవడం, గాయపడడం, కనిపించకుండా పోవడం జరిగింది.

* మార్కు - ఫ్రాంకు - పౌండు-డాలర్, ఇవన్నీ పైనచెప్పిన ఆయాదేశాల నాణాలు. 'హెర్‌మార్కు' అంటే జర్మనీ పెట్టుబడిదారుడు - అలాగే తతిమ్మావి కూడా - వెక్కిరింపుగా వాడిన పదాలివి.

న్యూయార్క్, కాలిఫోర్నియా ఫ్లోరిడా, ఇల్లినోయిస్, కాన్సాస్, టెక్సాస్‌లలో నున్న ప్రజలందరినీ కల్పితే ఎంతమంది వుంటారో, వారికంటె అధికంగా, కన్నో, కాలో, చేయో, పోగొట్టుకొన్నారు. లేదా భూమిమీద కన్పడకుండా అంతరించిపోయారు. పెట్టుబడిదారుల పేరాశ కార్మికులకు చేసిన బహుమానం అది.

* * *

పడుచువాళ్లు, ముసలివాళ్లు, రైతులు, కూలీలు, అందరూ సైనికులుగా చేయబడ్డారు. ఇవానుకు తన గ్రామంలో ఒక కొడుకు వున్నాడు. అతని పేరు కూడా ఇవానే. అతడు పొడుగ్గా వుండేవాడు. చక్కని జుట్టు వుండేది. ఒక రోజున అతడున్న చోటుకు జారు పోలీసు వచ్చి ఇలా అన్నాడు. "నీవు జర్మన్లను చంపాలి."

అందుచేత, ఒక రోజున, మన యువ ఇవాన్ తన గ్రామంలోని తక్కిన యువకులతోను. బాలురతోను, ముసలివాళ్ళతోను యుద్ధానికి వెళ్ళాడు. ఇవాన్‌కు ఒక యూనిఫారమూ, ఒక బోయనెటూ ఇచ్చారు. ఇంకా వేలకొలది సైనికులతోపాటు అతడు ఒక రైలులో ఎక్కాడు. వాళ్ళందరినీ బండినిండా కుక్కారు. కొంతమంది క్రింద పడుకొన్నారు. ఇవాన్ తన బెంచీమీద కూర్చుని నిద్రపోయాడు. వాళ్ళు పొలాలు, గ్రామాలు, నదులు, దాటిపోయారు. ఇవాన్, తాను మళ్ళా ఇవన్నీ చూడగలనా అని ఆశ్చర్యపోయాడు.

తూర్పురంగంలో ట్రెంచెస్‌లోకి వారు చేరుకునేటప్పటికి, వర్షం కురుస్తోంది. చలిజోరుగా వేస్తోంది. వర్షం ఇవాన్‌కోటగుండా, భుజాల మీద క్రిందకు పోతున్నది. బూట్లు ఇవాన్‌ను కరుస్తున్నాయి. అయినా చీకటి గోతులలో బురదగుండా ఈడ్చుకపోయారు. తుట్టతుదకు అతని రెజిమెంటు ఒక భూమి అడుగున ఉన్న బారక్సు వద్దకు వచ్చింది. తమ సంచుల్ని అవతలపారేసి, కొయ్యచెక్కలమీద పడుకొన్నారు. అవేవారి పడకలు. వారికి రొట్టె, టీ ఇచ్చారు. రొట్టె ముదతలు పడిపోయింది.

ఎప్పుడూ తుపాకుల ధ్వనివినబడేది. ఒక్కొక్కసారి తుపాకుల గింగురుమనే ధ్వని దూరంగావినబడేది. ఒక్కొకసారి బాంబులు చాలా

సమీపంలోపడేవి. ఆకాశమంతా వాటిధ్వనితో బ్రద్దలయిపోతోంది. టేబిల్ పైన చీనారేకు డబ్బాల గలగలధ్వని వినబడుతోంది. సైలనికు ముఖాలుపాలిపోయాయి. ఏక్షణమైనా వారు చనిపోవచ్చు. కాని, ఎందుకు? దేనికోసం ?

ఒకరోజున ఇవాన్ రెజిమెంటును "పోండి" అంటూ ఆజ్ఞాపించారు. ప్రతివాడూ తనబోయ్‌నెటును గట్టిగా పట్టుకొన్నాడు. మరఫిరంగులు నెమ్మదిగా ప్రేలాయి. ముందుకు పోతున్న సైనికులకు అడ్డుగా మరఫిరంగుల పొగ. తెరగా వుపయోగించేది. వినాశనమనే గాలిని పీల్చుతున్న మహారాక్షసులులాగా. టాంకులు నోమేన్స్‌లాండ్‌లో (రెండుపక్షాల యుద్ధ భూమికి మధ్యనున్న ఖాళీప్రదేశంలో) టాంకులు నడవసాగాయి. ఇవాన్ గుండెలో గుబులుగుబులు మంటున్నది. ముందుకు ప్రాకులాడుతూ పోయాడు.

జర్మన్ కార్మికులున్న అవతలవైపునుండి హఠాత్తుగా తుపాకులు బదులు చెప్పసాగాయి. ఒక విమానం బాంబులను కురిపించసాగింది. ఒకటి యువ ఇవాన్ ప్రక్కగానే పడింది. వణికిపోతూ ముందుకు పరిగెత్తాడు. జర్మన్ శ్రేణులకు దగ్గరగా పోతున్నారు. వాళ్ళు. తుపాకి గుండ్లు మరింత జోరుగా వస్తున్నాయి. జర్మన్లిప్పుడు ముందుకు వస్తున్నారు. ఇవాన్‌వాళ్ళు ముందుకురావడం చూస్తున్నాడు. ఇంకా బాంబులు పడ్డాయి. భూమి కంపించింది. ఇవాన్ ఒక ఫిరంగి చేసినబొక్కలో దూరాడు. ఒక మనిషికాళ్లగాబోలు తాకినట్లయింది. అవిచల్లగా వున్నాయి ఇవాన్ నిప్పుపుల్లగీసి చూచాడు. చనిపోయిన మనిషి కన్పించాడు. కొద్ది అడుగుల దూరంలో అతని తల బురదలో పడివుంది. ఇవాన్ వళ్ళు జలదరించింది. మెదలకుండా పడుకొన్నాడు. కొన్ని నిమిషాలు—బహుశా ఒక అరగంట జరిగిందేమో. కాని యువ ఇవాన్‌కు అది జీవితం అంతంలాగ కన్పించింది.

కొంతసేపటికి తుపాకులు పేలడం మానాయి. పొగ పోయింది. దాదాపు తెల్లవారింది. ఇవాన్ ఆ బొక్కలోంచి బయటకు వచ్చాడు.

అడ్డదిడ్డంగా పడివున్న వాటినన్నిటినీ దాటుకొంటూ పోయాడు. చివరకు తన కందకాలదగ్గరకు చేరాడు. కాని కదలలేనంతటి అలసట.

సూర్యోదయం అయేసరికి నోమేన్స్‌లాండ్‌లో రష్యన్‌ల జర్మన్ల చచ్చిపోయిన శవాలు. బద్దలు కొబడిన భూమితప్పితే మరేమీ కన్పించ లేదు. వాళ్లు చచ్చిపోయారు. దేనికోసం ?

"ధనికుల లాభాలకోసం మీరు చచ్చిపోతున్నారు." అని లెనిన్ సరియైన సమాధానం ఇచ్చాడు.

జర్మను కార్మికులకు వారు "తమ మాతృభూమిని రక్షించడానికి" పోరాడుతున్నారని చెప్పబడింది. బ్రిటిషు కార్మికులకు, వారు "రక్తపాతంలో మునిగిన బెల్జియం గౌరవంకోసం" పోరాడుతున్నారని చెప్ప బడింది. అమెరికన్ కార్మికులకు "ప్రజాస్వామ్యం కోసం ప్రపంచాన్ని రక్షించడానికి" తుపాకులు పేల్చండని చెప్పబడింది. కాని, యుద్ధకాల మంతటనూ, హెర్‌మార్క్, లార్డ్‌పౌండూ, ఎం ఫ్రాంకూ, మిష్టర్ డాలరూ, ఇంకా ధనవంతులయ్యారు. సైన్యాలకు రొట్టెల్నీ దుస్తుల్నీ ఎక్కువ ధరలకు అమ్మారు. ఆయుధ సామాగ్రి ఫ్యాక్టరీలను నెలకొల్పి గొప్ప లాభాలను సంపాదించారు. యుద్ధసామాగ్రి తయారుచేసే అనేక పెద్దపెద్ద ఫ్యాక్టరీలు, ఆయుధాలను, యుద్ధ సామాగ్రిని సైన్యాలకేగాక, శత్రు సైన్యాలకు కూడా అమ్మారు !

యూరప్‌లోను, రష్యాలోను, దగాకోరు నాయకులు కార్మికులకు అబద్దాలు చెబుతున్నారు. కార్మికులను, తమ దేశాలను రక్షించుకోమని చెబుతున్నారు. ఎవరిదేశం ? లెనినూ అతడు నిర్మించిన బోల్షివిక్ పార్టీల విస్పష్టధ్వని యుద్ధరోధనాలను చీల్చుకొంటూ మార్మోగింది. ఇలా జవాబు చెప్పింది. ఇది మన దేశంకాదు. ఇది పెట్టుబడిదారులకూ, ధనికులకూ చెందివుంది. ఈ ద్రోహులు, పీరొకరి గొంతుక ఒకరు కోసుకొని ధనికుల లాభాలను కాపాడమని చెబుతున్నారు. మీరురష్యన్, జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు కార్మికులందరూ—ఏకంకావాలి. యుద్ధాన్ని ఆపివేయాలి. పరిపాల కులకు, పెట్టుబడి దారులకు వ్యతిరేకంగా తిరగబడండి. కథ అడ్డం

తిప్పండి. యుద్ధాన్ని విప్లవంగా మార్చండి!" లెనిన్ సత్యాన్ని గ్రహించాడు.

*         *         *

"బర్గు" అంటే జర్మనీ భాషలో పట్టణం. పీటర్సుబర్గులో "బర్గు" వుంది గనుక అది తీసివేసి మరోపేరు పెట్టారు. పీటర్సుబర్గు, పెట్రోగ్రాడ్ అయింది. పెట్రోగ్రాడ్‌లో పాలులేవు. మాంసంలేదు. రొట్టెలేదు. వీరా రాత్రిళ్ళు రొట్టెలమ్మే దుకాణానికి వెళ్ళేది. తన బిడ్డ యింటివద్ద ఆకలితో బాధపడుతుండడంవల్ల, ఆ దుకాణం తెరిచేదాకా, వరుసగా నిలబడిన జనంతోపాటు వీరాకూడా నిలబడేది. చివరకు వాళ్ళు దుకాణం తెరచి, ఒక్కొక్కరికి 20 తులాల రొట్టె అమ్మారు రొట్టె అసహ్యంగా వుంది. పైగా అది చాలినంతగానూ లేదు.

కార్మికుల కడుపులు ఖాళీగావున్నాయి. "మనజేబులు డబ్బులేకుండా ఖాళీచేసే-మనలను మలమలమాడ్చే - ఈ యుద్ధాన్ని ఆపివేయాలి" అని వారరిచారు. వారు పనిచేయడం మానివేశారు.

ఉద్రేకం జాస్తి అయింది. జారుకూ, ధనిక పెట్టుబడి దారులకూ వ్యతిరేకంగా లోలోన రగుల్కొనే క్రోదాగ్ని ఒక్కసారి పెట్రోగ్రాడ్‌లో భగ్గుమన్నది. వీధులన్నీ కార్మికులతో నిండిపోయాయి. అందరూ పట్టణకేంద్రభాగానికి కదలసాగారు. పోలీసులు బ్రిడ్జీలకు అడ్డుగానిలిచారు. అయినా, కార్మికులు, తమప్రాణాలను సరకుచేయకుండా మంచుతో నిండిన నదులను దాటారు.

వీరా కూడా తన బిడ్డను చంకన వేసుకుని వీధుల్లోకి పరిగెత్తింది. ఉద్రేకభావాలతో మాట్లాడుతున్న సైనికుల మధ్యకు ఉరికింది. "మీరు మా పక్షమేనా ?" అని అరిచింది.

"అవును. విప్లవం చిరస్థాయియగుగాక!" అని వారు జవాబిచ్చారు. ఆమె త్వరత్వరగా పోసాగింది. దూరంగా తీవ్రంగా కాల్పులు వినవొస్తున్నాయి. సైనికులు, నావికులు, కార్మికుల పెట్రోగ్రాడ్‌ను సంరక్షించుతున్నారు. వీరా, ఆనందంతో నవ్వింది. ఒక బ్రిడ్జిగుండా, ఒక భవనం మండిపోవడం వీరా చూచింది. పెద్ద పెద్ద అగ్నిజ్వాలల నాలుకలు

చాచుకొని ఆకాశాన్ని తాకుతున్నాయి. ఆకాశం అంతా ఎర్రటి రంగు పూసినట్లయింది. ఫిబ్రవరి విప్లవం (1917) ప్రారంభమయింది.

మరుసటి రోజున, ట్రాలీలను రోడ్లపై బోల్తా పడేశారు. వాటి వెనుక కార్మికులు తమని రక్షించుకో మొదలెట్టారు. కార్మికులందరూ "డౌన్ విత్ ది వార్, డౌన్ విత్ ది జార్!" (యుద్ధం నశించాలి! జార్ నశించాలి) అని అరిచారు.

ఉద్రేకపు రోజులు, పని రోజులు గడిచిపోయాయి. జారు అంటే ఇంకా రాజభక్తి గల ఇతర సైనికులను, కార్మికులపై తుపాకులు పేల్చ వద్దని సైనికులు కోరారు. సోవియటులు అని పిలువబడే కౌన్సిళ్ళను కార్మికులు ఆర్గనైజ్ చేయడంలో మునిగిపోయారు. "సోవియట్‌లను నిర్మించండి. అవి కార్మికులను స్వాతంత్ర్యానికి తీసుకుపోతాయి" అని అరిచారు కార్మికులు, జారును కూలద్రోశారు.

కార్మికులందరూ విజయం పొందినట్లు భావించారు. ప్రతివాడూ, విప్లవశక్తి తనలోనే క్రిందికీ పైకీ పొరలిపోతున్నదని భావించాడు. ధనికులూ, రాచవంశ ప్రభువులూ మాత్రం గజగజ వణకిపోయి, తమ నగలను, నాణ్యాలనూ దాచారు. కార్మికులు జారును తరిమివేసినపుడు, పాతపద్ధతి అంతటితో నశించిందని వారికి తెలుసు. అయినా కార్మికులింకా అధికారం పొందలేదు. ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. దానిలో పెత్తనం ధనిక యజమానులదే. వారు కార్మికులను మోసపుచ్చి అధికారం తమ హస్తాలలోనే వుంచుకోవాలని ప్రయత్నించారు.

లెనిన్ స్విడ్జర్లండులో వున్నాడు. భోజనం ముగించే సమయానికి ఒకాయన గదిలోకి పరుగెత్తుక వచ్చాడు. "విన్నారా యీ వార్త!" అని అరిచాడు. "రష్యాలో విప్లవం. విప్లవం" లెనిన్ ఒక్క గంతువేశాడు. తన భార్యతోపాటు సరస్సు గట్టు దగ్గరకు పరుగెత్తాడు. అక్కడ పత్రికలన్నీ రాగానే వ్రేలాడగడతారు. ఆఖరి వార్తలను తిరిగి తిరిగి చదివాడు లెనిన్. విప్లవం నిజంగానే వచ్చింది! ఇన్ని సంవత్సరాలూ దానికోసం అతడు సన్నాహాలు గావించాడు. రష్యాకు తిరిగి పోవాలన్న ఆదుర్దా అతన్ని కాల్చివేసింది. రష్యాలో ఒక నూతన ప్రభాత భాను

డుదయించేదాకా, పోరాటంలో తాను కూడ నిమగ్నమై నడపాలని లెనిన్ భావించాడు.

అతడు త్వరగా వేగంగా పనిచేశాడు. సత్య వివేకాలతో ప్రజ్వరిల్లే సందేశాన్ని కార్మికులకు పంపాడు. "విప్లవం ఆపకండి! వ్యాపింపజేయండి. కొత్త సమూహాలను ఉద్రేకపరచండి. ప్రతివానికీ శాంతి, కార్మికులకు తిండి, రైతులకు భూమి, కార్మిక కర్షకుల సాయుధ సోవియట్లు అధికారాన్ని హస్తగతం చేసికొన్నప్పుడే లభిస్తాయి. మీ చేతుల్లోకి అధికారాన్ని తీసికోండి."

అతని మాటలు క్రియారూపం దాల్చాలంటే అతను రష్యా వెళ్ళాలి. అందుకు ఊపిరాడకుండా కృషిచేశాడు. యుద్ధంలో నిమగ్నమైన అనేక దేశాలు దాటి వెళ్లాలి. రష్యా ధనిక పెట్టుబడిదారులు అతనిని లోనికి రానీయరు. ఎలాగయితేనేం, లెనిన్ వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. ఖైదీ క్యాంపులలో మగ్గుచున్న సైనికులకు రష్యా విప్లవాన్ని గురించి తెలియజేస్తూ, వారికి ఒక నూతన ఆశాజ్యోతిని చూపించుతూ లేఖ వ్రాశాడు. స్విస్ కార్మికులకు తన వీడ్కోలు సందేశాన్ని ఇలా ఇచ్చాడు. "యూరప్‌లో ప్రారంభమవుతున్న విప్లవం చిరస్థాయి అగుకాక!"

* * *

ఈలోగా యుద్ధం తీవ్రంగా విజృంభించింది. జారు స్థానే ఏర్పడ్డ తాత్కాలిక ప్రభుత్వం ప్రజలకు తిండిని ఈయలేదు. శాంతిని సమకూర్చలేదు. పైగా గాయపడటానికీ, చనిపోవడానికీ మరికొన్ని సైన్యాలను యుద్ధరంగానికి పంపింది. జారుకంటె కూడా బాగా నూతన ప్రభువులు, పెట్టుబడిదారుల, స్పెక్యులేటర్ల (అంచనాలు వేసి, వర్తకం చేసేవారు) లాభాలను రక్షించ మొదలెట్టారు.

స్టాక్ ఎక్స్ఛేంజ్ ముందు ప్రతిరోజూ మనుష్యులు పోగయ్యేవారు. పేరాసతో కుమిలిపోతూ, ఉద్రేకంతో నిలబడేవారు. తుపాకి గుండ్లను, తుపాకులను ఉత్పత్తి చేస్తూ, అమ్ముతూ వారెంతో లాభాన్ని గడిస్తున్నారు. రక్తధారలతో మునిగిన డబ్బుకోసం క్రూరమైన పోటీతో ఒకళ్ళ గొంతుకల లొకడు పట్టుకొంటున్నారు.

కాని లెనిన్ అప్పటికే రష్యాకు ప్రయాణమయ్యాడు.

రైలు కదిలింది. దానికూత చెవుల్లో గింగిరు మంటోంది. కార్మిక వర్గంకోసం పోరాడినందుకుగాను ప్రవాస మంపబడిన ముప్పదిమంది, కార్మికవర్గం తలయెత్తే—కార్మికవర్గ అధికారం కైవశం చేసికునేందుకు పోరాడే—దేశానికి పోతున్నారు. రష్యాకు సమీపంగా రైలు చక్రాలు ఒక చుట్టు తిరిగినప్పుడెల్లా, లెనిన్ "మనం తిన్నగా జైలులోకి పోవడం లేదుగదా" అని అనుకునేవాడు.

కాని, విప్లవం అటో ఇటో తేలే నిశ్చిత సమయంలో తాను దూరంగా ఉండడం లెనిన్‌కు ఇష్టంలేదు.

ఇంజన్ గుప్ గుప్ మనడం ఆపివేసి, చక్రాలు ఆఖరిదఫా తిరిగి, బండి ఆగడంతోటే మేళతాళాలు వినబడ్డాయి. మేళతాళాలను వినిపించనీయకుండా కార్మికుల గుంపులు నినాదాలిస్తున్నాయి. అంతర్జాతీయ గీతం "ఆకలి మంటచే మలమల మాడే అనాధులందరు లేవండోయ్! మంచి ప్రపంచము రానున్నదీ మనకందరకును లేవండోయ్" స్టేషన్ అంతా ప్రతిధ్వనించింది. తమ నాయకుని ఆహ్వానించడానికి పెట్రోగ్రాడ్ కార్మికులందరూ వచ్చారు. వీరాకూడ తన బిడ్డను చంక నేసుకొని వచ్చింది.

ప్రతివాడూ లెనిన్ ఏం చెబుతాడో వినాలని కోరాడు. రోజంతా పట్టణమంతా ఊరేగాడు. "కామ్రేడ్స్, కార్మికులారా! సైనికులారా, మీ చేతులనుండి రైఫిల్సును క్రింద పారేయకండి. భూస్వాములను, పెట్టుబడిదారులను తరిమివేయండి. అధికారం మీ హస్తగతం చేసుకోండి" అంటూ ఉద్బోధించాడు. పదేపదే కార్మికులకు ఇదే చెప్పాడు. ఆనందోత్సాహముతో కార్మికులు తమ టోపీలు గాలిలో ఎగరవేస్తూ కేకలువేశారు. తాము లెనిన్‌వద్ద విన్నదానిని ఇంటివద్దనున్న కార్మికులకు చెప్పారు. కార్మిక కర్షకులకు లెనిన్ నిజమైన ప్రతినిధి. వారి హృదయాలలోని కోర్కెలను లెనిన్ తన మాటల్లో బయటపెట్టాడు. అందుచేతనే ప్రపంచంలో ఆరవ భాగాన్ని విముక్తిచేసే ఈ కార్మిక కర్షక మహా విప్లవానికి అతడు నాయకుడయ్యాడు.

కార్మిక నాయకుని యెడల పెట్టుబడిదారులకు, భూస్వాములకు వుండే ద్వేషం ఇంతింతగాదు లెనిన్‌గురించి. అసత్యాలను కార్మికుల మనస్సులలో వ్యాపింపజేయ ప్రయత్నించారు. వారిలోవారు ఇలా గుస గుస లాడారు. "మనం నాయకుని అరెస్టుచేసి విప్లవానికి తల లేకుండా తెగగొడదాం. మనం లెనిన్‌ను నాశనంచేయాలి."

పెట్రోగ్రాడ్ కార్మికులు తమ ఇండ్లలో లెనిన్‌ను దాచారు. పగటి పూట అతడు ఇంటిలోపలే వుండేవాడు. రాత్రిళ్ళు, మంచిగాలి కాస్త పీల్చుకోడానికి బయటికి పోయేవాడు. కార్మికులకు విజయాన్నిగూర్చే పార్టీని నిర్మించడానికి తన యావత్ కాలాన్నీ ఉపయోగించాడు. కార్మికులు రహస్యంగా అతన్ని సందర్శించి, అతని సందేశాన్ని తమ కామ్రేడ్సుకు తీసుకు వచ్చేవారు.

కాని కార్మికుల మధ్యలోనే ఇంకా అనేకమంది శత్రువులున్నారు. ఏవీధి మూలనో, లెనిన్‌ను గుర్తించి పోలీసులకు వాళ్ల తెలియజేయ వచ్చు. లెనిన్, పెట్రోగ్రాడును పూర్తిగా వదలివేయవలసి వచ్చింది. గ్రామసీమకు వెళ్ళి ఒక కార్మికుని ఇంట్లో వుండసాగాడు. తలగొరిగించి, గడ్డంతీసి పారవేశాడు.

లెనిన్ నివసించుచున్న ఇంటి కార్మికునికి ఒక "బేరన్" వుంది. అదే లెనిన్ తన యిల్లుగా చేసుకొన్నాడు పెట్టుబడిదారులు ఇంకా కార్మిక నాయకుని కోసం చూస్తున్నారు. అతన్ని పట్టి ఇస్తే పెద్ద బహుమానం ఇస్తామని ప్రకటించారు. లెనిన్ ఇంకా దూరానికి పోవలవచ్చింది.

ఒకరోజున లెనిన్ తాను నివసించుచున్న యింటి కార్మికునకు వీడ్కోలు చెప్పాడు. అతనూ మరో కామ్రేడు చిన్న బోటుఎక్కి దాదాపు నల్గు మైళ్లపోయారు ఆ పడవను ఒడ్డున వదలి, అరణ్యాలలోబడి ఒక పెద్ద మైదానం వచ్చేదాకా నడిచారు. ఈ బురద మైదానంలోనే వారుతమ ఇల్లును నిర్మించుకొన్నారు. చెట్లకొమ్మలతోను, గడ్డితోను నిర్మించిన ఒక గుడిసెలో వారుండేవారు. గుడిసె బయట మంటవేసి భోజనం వండుకొనే వారు. వాళ్ళకు సహచరులు, కన్నాలలోనుంచి బయటికిరా సాహసించిన అడవి కుందేళ్ళు, తేమనేలపైన క్రిందుగా ఎగిరే పక్షులూ, రాత్రిళ్ల

ఉజ్వలంగా ప్రకాశించే నక్షత్రాలూ, ఎవరైనావస్తే, లెనిన్ తానుదగ్గర లోనేవున్న వ్యవసాయకూలీలతోపాటు గడ్డిపోగుచేస్తూ కూర్చునేవాడు. కాని, ఎవరూ అక్కడ నివసించుచున్నది విప్లవనాయకుడని కలలోనైతం తలచలేదు.

ఈ చిన్న గుడిసే, కమాండర్‌యొక్క ప్రధాన కార్యాలయం. జైళ్ళనుండి, సైబీరియానుండి, ఇన్ని సంవత్సరాలుగా ప్రవాసమున్న విదేశాలనుండి, నడిపినట్లుగానే, ఈ బురదపొలాలనుంచిరే, లెనిన్ కార్మిక కర్షకులను నడుపసాగాడు. సూర్యుడుదయించేవాడు, అస్తమించే వాడు. రోజులు గడిచిపోతున్నాయి. ఇక, లెనిన్ కార్మికులను తిరగబడ మని కోరాడు. "మనం చాలాకాలం కాలవ్యయం చేశాం. ఇకమనం మన చేతులలోకి అధికారం లాక్కోవాలి" అని వ్రాశాడు.

* * *

ఆకులు, పసుపు, ఎర్ర, బూడిదరంగులుగా మారి భూమిమీద పడి పోతున్నాయి. అది 1917లో ఆకురాలు కాలం. అమెరికానుంచి, అట్లాం టిక్ సముద్రాన్ని ఛేదించుకొంటూ పెద్ద పెద్ద వేగంగా నడిచే నౌకలు అమెరికను యువకులను మనుష్యులను తీసుకొస్తున్నాయి. ఒక్కరాత్రిలో వర్తకులను పెద్ద ధనికుల్నిచేసిన తుపాకిగుండ్లకు గురికావడానికే వారు తీసుకుపోబడుతున్నారు.

తూర్పురంగంలో, రష్యా-జర్మనీ-పోలండు సరిహద్దులలో కంద కాలలోని సైనికులు ఈ యుద్ధంతో అలసిపోయారు. వారిలా అనుకొనే వారు. "మనం మనచేతుల్నీ, కాళ్ళనీ, కళ్ళనీ పొగొట్టుకుంటున్నాం. ఎందుకు? ధనికుల్ని, మరింత ధనికుల్నిగాచేయడానికి. దీనిలో అర్థం లేదు."

లెనిన్ చెప్పినదానిని సైనికులు అర్థంచేసుకోవడం మొదలెట్టారు. వారు పోరాడ తిరస్కరించారు. జర్మన్ సైనికులు, రష్యన్ సైనికులు, తుపాకి గుండ్లతో ఆహ్వానించుకోవడం పోయి, ఒకరినొకరు కౌగలించు కోడం మొదలెట్టారు. తమ తుపాకులను ట్రెంచీలలో పారవేసి, "నోమేన్స్ లాండు" లో కలిసికో మొదలెట్టారు. ఒకరిభాష ఒకరు

అర్థం చేసికోడం కష్టమే. కాని వారందరికీ అర్థమయ్యేమాటలు కొన్ని కనుగొన్నారు. "ఇక యుద్ధం వద్దు" అన్నాడు రష్యన్ సైనికుడు. "వద్దు. ఇక యుద్ధం వద్దు" అని జర్మన్ సైనికుడు జవాబిచ్చాడు. వారు ఆనందంలో కేకలు వేశారు. కౌగలించుకొని ముద్దుపెట్టుకొన్నారు. ఒకరికొకరు తిండిపెట్టుకొన్నారు. సిగరెట్లు యిచ్చుకొన్నారు. యుద్ధం కొనసాగించ తిరస్కరించారు.

యువ ఇవాన్‌కు కూడా యుద్ధం అంటే విముఖత ఏర్పడింది. ప్రతిరోజూ, అతనూ, తదితర సైనికులూ, ఈ రక్తపాత హత్యాకాండ ఎప్పుడంతరించుకుందని ఒకరినొకరు ప్రశ్నించుకొనేవారు. చివరకు యుద్ధం ఎప్పుడు అంతమవుతుందో తెలిసికోడానికి, పెట్రోగ్రాడ్ వెళ్ళ నిశ్చయించుకొన్నారు. యువక ఇవానూ, ఇతర సైనికులు, తమ మూటలను భుజాలను వేసుకొని, పెట్రోగ్రాడ్ పొలాలగుండా నడిచే రైలు ఎక్కారు. పెట్రోగ్రాడ్ పట్టణ పరిహద్దులకు వచ్చేటప్పటికి, అచ్చట ఫిరంగి కాల్పులు వినిపించాయి. ఒక స్టేషనుదగ్గర కార్మికులు, సైనికులూ, నావికులు తమ మెషిన్‌గన్‌లతో కూడా హడావిడిగా పోతున్నారు. సైనికులు రైలునుండి దూకి, వారితో కలుసుకొన్నారు. వీధులగుండా నడిచారు. స్త్రీలు, పిల్లలుకూడా వారివెంట నడిచారు. కార్మికులు ఫ్యాక్టరీల నుండి, ఇరుకు సందుగొందులనుండి బయటికి వచ్చారు. వీరా తండ్రి, నెరసిపోయిన గడ్డంతో ఒక కర్ర ఊతగా గొని, బయలుదేరాడు. పిల్లలు జండాలను, "రైతులకు పొలం, ప్రజలకు శాంతి, ఆకలిగొన్నవారికి తిండి." అన్న నినాదాలుగల పతాకాలను ఎగురవేస్తూ అతని ముందు నడిచారు.

పెట్రోగ్రాడ్‌లో నిల్వ ఉండిన సైనికులు కూడా కలిసారు. వారు, తమతోపాటు, సాయుధ మోటార్లను, మెషిన్ గన్లను తెచ్చారు. లారీ తర్వాత లారీ సైనికులతోను, సాయుధ కార్మికులతోను నిండిపోయింది. విప్లవ యుద్ధరంగానికి కదలిపోయింది.

ధనికవర్తకుల మరఫిరంగులు కార్మికులపైన గర్జించాయి. తాత్కాలిక ప్రభుత్వం కార్మిక విప్లవాన్ని తుడిచిపెట్ట సంకల్పించుకొంది.

కాని, తమ సోవియట్ల ద్వారానే పెట్టుబడిదారుల క్రూర నిర్బంధాన్ని తుదిముట్టించడానికి మార్గం అని, కార్మికులకు తెలుసు. "అధికారమంతా సోవియట్లకే" అని వారరిచారు. వారు బలపడుతూ నెమ్మదిగా ముందుకు వచ్చారు. పెట్టుబడిదారుల తుపాకులకు తమ తుపాకులు జవాబు చెప్పాయి. కార్మిక కర్షకుల ప్రథమ విప్లవాన్ని రక్షించుకొనడానికి, సైనికులు, నావికులు, కూలీలు, రైతులు తమ ప్రాణాలను ఒడ్డి ప్రతి గడప లోను సంసిద్ధంగా వున్నారు.

వారిముందు బోల్షివిక్కులు—లెనిన్ అనుచరులూ నడిచారు. లెనినే స్వంతంగా నాయకత్వం వహించాడు. స్టాలినూ, తదితర దృఢమైన బోల్షివిక్కులూ అతనికి సహాయకులుగా వున్నారు. విప్లవానికి లెనినే సేనాధిపతి. పెట్రోగ్రాడ్‌లోని స్మోల్నీ విద్యాసంస్థకు ఒకరాత్రి ముందుగా మారువేషంలో లెనిన్ వచ్చాడు. ఇంతకుపూర్వం, ఇది ధనికుల కూతుళ్ళకు పాఠశాల. పాఠశాల హాల్సులో ఇదివరలా ఆ పిల్లల వెకిలినవ్వులకు బదులుగా, దృఢమైన పాదాల చప్పుడు ప్రతిధ్వనించింది. స్మోల్నీ విద్యాసంస్థ, ఇపుడు కార్మికులకు, సైనికులకు, రైతులకు ప్రధాన కార్యాలయంగా మారింది.

లెనిన్ వద్దకు, దూతలు రిపోర్టులతో పరుగెత్తుకవచ్చి, అతని సూచనలను తిరిగి తీసుకుపోతూ వుండేవారు. "పీటర్ అండ్ పాల్ కోటను పట్టుకోండి" అని 'అరోరా' శౌర్యనాయకులకు చెప్పాడు. "రాజభవనాన్ని ముట్టడించడానికి, విప్లవ సైనిక దళాలూ, కార్మికులూ సిద్ధంగా వున్నారా?" అని ఒక కార్మికుని ప్రశ్నించాడు ఆదుర్దాగా. "టెలిఫోనును, రైలుస్టేషన్లను ఆక్రమించండి" అని ఇతర్లకు చెప్పాడు.

జారు రాజభవనం, శత్రువు ముఖ్యకేంద్రం. 'అరోరా' నౌక నదిమీద ముందుకు వచ్చింది. రాజభవనంలోని అలంకరించిన ఆ గోడల పైన ఫిరంగులను పేల్చింది. కార్మిక, సైనిక, నావికుల తుపాకి దెబ్బలను శత్రువు ఎదిరించలేకపోయాడు. చిట్టచివరకు జారు రాజభవనం కార్మికుల చేతిలో పడింది. ఎంతో విలువయైన వస్తువులతో అలంకరించబడిన ఆ గదులలో ఇక నిరంకుశ ప్రభువు పరిపాలించడు.

రోజంతా కార్మికులు పోరాడారు. శత్రువుల చివరి ఫిరంగి ధ్వని తమ పెట్రోగ్రాడ్ ఫిరంగి ధ్వనులలో మునిగి అంతరించిపోయేదాకా, కార్మికులు ముందుకు పోతూనే వున్నారు. తుపాకులు పేల్చడం మానివేసిన తర్వాత లెనిన్ ఒక కంబళి తీసుకొని నేలమీద కొద్ది గంటలు నిద్రపోయాడు.

నిద్రతో కొంచెం తేరుకొన్న లెనిన్, సోవియట్ల కాంగ్రెసు వద్దకు వెళ్ళాడు. రష్యానుండి అన్ని ప్రాంతాల నుంచి అక్కడకు వచ్చారు. ఈ కార్మిక కర్షకుల నిజమైన ప్రతినిధులు నూతన ప్రభుత్వాన్ని ప్రకటించారు. "అధికారమంతా సోవియట్లకే." అది 1917 నవంబరు 7 వ తేదీ. కార్మికులు, సైనికులూ "మనం భూస్వాములనుండి భూమిని లాగివేసి రైతుల కిచ్చాం." "మనం పెట్టుబడిదారుల నుండి ఫ్యాక్టరీలను లాగివేసి కార్మికుల కిచ్చాం." "మనం యుద్ధాన్ని ఆపివేశాం. మనం జారును వదిలించుకొన్నాం." "కార్మిక కర్షకుల మాతృభూమిని, సోవియట్ రిపబ్లిక్‌ను మనం స్థాపించాం." "సోవియట్ రిపబ్లిక్ చిరస్థాయి అగుగాక." అనే నినాదాలతో ముందుకు పోయారు.

కార్మికులు, కర్షకులు తమ నాయకుడైన లెనిన్‌ను, ప్రపంచంలో ప్రథమ కార్మిక ప్రభుత్వమైన నూతన సోవియట్ రిపబ్లిక్‌కు అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు.

కొంతకాలం అంతా గందరగోళంగా వుంది. అయినా కార్మికులు వీరోచితంగా ముందుకు పోయారు. తమ జీవితమంతా దస్కాలమీద వాలడం తప్ప మరేమి యెరుగని క్లార్కులు, సోవియట్‌లో పని చేయమని నిరాకరించారు. పనిచేసే దుస్తులతో నున్న కార్మికులు ఆ స్థానం ఆక్రమించారు. కొంతమంది టెలిఫోను బాలికలు, నావికులను వందల కొలది పనిముట్లను ఎలా ఉపయోగించాలో నేర్పారు. రైల్వే లైన్‌మెన్, స్టేషన్ సూపరెంటెండెంటు లయ్యారు. నెమ్మదిగా రైళ్ళు కదల నారంభించాయి. టెలిఫోను బెల్సు మ్రోగసాగాయి. గ్రామసీమల నుండి పట్టణాలకు తిండి రావడం మొదలెట్టింది. కార్మికు లధికారంలో వున్నారు.

కాని కార్మికుల కింక శత్రువు లున్నారు. విదేశాలలో వుంటున్న పెద్ద పెద్ద ఫ్యాక్టరీల యజమానులు, రష్యాలోని ఇదివరకటి రాచవంశ ప్రభువులతోను, ధనిక వర్తకులతోను కలిసి కార్మికుల సోవియట్లను పడత్రోయాలని ప్రయత్నించారు. వీరిని "వైట్స్" అంటారు. ఉత్తరాన ఒకటి, దక్షిణాన ఒకటి. బాల్టిక్ రాజ్యప్రదేశంలో మరొకటి సైన్యాలను ప్రోగు చేశారు. సోవియట్లను నాశనం చేయడానికి మూడుతలల రాక్షసిలాగా ఇవి ప్రయత్నించాయి.

వైట్స్ సైన్యాలు నెమ్మదిగా, కార్మికులకు, బోల్షివిక్కులకు వ్యతిరేకంగా ముందుకు వచ్చాయి. తాము అంత ప్రియంగా సంపాదించిన దానిని సంరక్షించుకోడానికి కార్మికుల, కర్షకులూ ప్రతిచోటా పరుగెత్తారు. సైబీరియా విశాల మైదానంలో, క్రిమియా కాకసస్ కొండ దారులలో, యుక్రైన్ పచ్చని బీళ్ళలో, కార్మిక కర్షక వీరుల దండులు ప్రోగయ్యాయి. వైట్ సైన్యాలకు జవాబు చెప్పాయి. ఒకసారి వైట్సు, పెట్రోగ్రాడ్ సమీపానికి వచ్చారు. తమ శత్రువులను పారద్రోలగలమా అని కార్మికులు సంశయించారు. కాని లెనిన్ వారి నుత్సాహ పరచాడు. "మనం ఒంటరిగా లేము. త్వరలో ఇతర దేశాల కార్మిక కర్షకులు మన సహాయానికి వస్తారు. ఈ లోగా మనం మన రెడ్ ఆర్మీని నిర్మించుకోవాలి" అన్నాడు.

అనేక రెడ్ ఆర్మీ రెజిమెంట్లు ఆర్గనైజ్ చేయబడినాయి. కార్మిక కర్షకులు సోవియట్ నక్షత్ర చిహ్నాన్ని తమ భుజాలమీద ధరించడానికి, తమ ఆశయం కోసం పోరాడుతున్నందుకు, గర్వపడ్డారు. వారు జయించారు. 1920 నాటికి రెడ్ ఆర్మీ తన శత్రువులను జయించింది.

హెర్ మార్కు, యం. ఫ్రాంకు, లార్డుపౌండ్, మిష్టర్ డాలర్లా పేపర్లు, లెనినంటేను, విప్లవం అంటేను ద్వేషంతో కుమిలిపోతున్నాయి. విప్లవం జయించడం, సోవియట్ రిపబ్లిక్ జీవించడం, వాళ్ళ కిష్టం లేదు. ఎందుకంటే, రష్యా సంపద తమకు కావాలని వారు కోరుతున్నారు. విప్లవం తమ దేశాలకు కూడా పాకుతుందేమోనని భయపడుతున్నారు. సైన్యాలతో కార్మిక కర్షక రిపబ్లిక్‌ను నాశనం చేయాలని,

కార్మిక కర్షకులకు తిండీ, మందులూ రాకుండా బ్లాకేడ్‌తో చంపాలని, క్షామంతో నాశనం చేయాలని ప్రయత్నించారు. సోవియట్ రిపబ్లిక్‌లను గురించి తమ తమ దేశాలలోని కార్మిక కర్షక మనస్సులను అసత్యాలతో నింపాలని ప్రయత్నించారు. సోవియట్ ప్రభుత్వం బలపడిన కొద్దీ అబద్ధాలు మరింత పెద్దవయ్యాయి. మొట్టమొదటినుండీ పెట్టుబడిదారుల పత్రికలు, "లెనిన్‌ను చంపివేశారని" ప్రచారం చేయ మొదలుపెట్టారు. వాళ్ళ ఉద్దేశ్యం "లెనిన్‌ను చంపివేయమని." జారు, లెనిన్‌ను ప్రవాసం పంపితే విప్లవం ఆగిపోతుందని తలచినట్లుగానే, తాత్కాలిక ప్రభుత్వం లెనిన్‌ను పట్టుకొని విప్లవాన్ని ఆపివేయాలని అతనికోసం వెతికినట్లుగానే, లెనిన్‌ను చంపితే సోవియట్ రిపబ్లిక్‌ను నాశనం చేయవచ్చునని వారు భావించారు.

లెనిన్ ఒక పెద్ద రాక్షసి అని నమ్మేటట్లు చేయాలని ప్రయత్నించారు. బోల్షివిక్ అంటే మీసాల దయ్యపోతు అనీ, అతను పళ్ళ మధ్య కత్తి పట్టుకొని వుంటాడనీ అనుకొనేటట్లు చిత్రించారు. రష్యన్ విప్లవం, ప్రపంచంలో అన్ని భాగాలలోను కార్మిక కర్షకులకు ఆశను రేకెత్తించింది. రష్యన్ కార్మిక కర్షకుల వీరకృత్యాలను వారు గమనించారు. తరతరాలుగా అనుభవించే ప్రజల బాధలు సమసిపోనున్నాయని వారు గ్రహించారు. "మనకి మార్గం చూపిన రష్యన్ కార్మికుల విప్లవం చిరస్థాయి అగుగాక!" అన్నారు వారు. అందుచేతనే మిష్టర్ డాలరూ, అతని స్నేహితులూ అబద్ధాలను స్వేచ్ఛగా వదిలారు. ఈ విధంగా సత్యాన్ని కప్పివేయవచ్చునని వారు భావించారు. కాని, లెనిన్ బోధించిన సత్యం, అసత్యపు పుకారు మబ్బుల మధ్య మెరపులా ప్రకాశించింది.

రెడ్ ఆర్మీ, దురాక్రమణదారులతో పోరాడి ఓడించుచున్నప్పుడు, లెనిన్ ఫ్యాక్టరీకి తిరిగాడు. ప్రస్తుత స్థితిని నిలబెట్టుకోగల్గితే భవిష్యత్తంతా వారిదేనని చెప్పాడు. "మీ రిపబ్లిక్‌ను, మీలో ప్రతివాడూ నడుప నేర్చుకోవాలి" అన్నాడు. ప్రతి ఫ్యాక్టరీలో లెనిన్‌ను హర్ష ధ్వానాలతో అభినందించారు.

ఒక ఫ్యాక్టరీలో, తమ ఉత్సాహాన్ని ఆపుకోలేక పోయారు. అతను మాట్లాడటం అయిపోయిన పిదపకూడా, లెనిన్ని యింటికి తీసుకుపోయే కారుదాకా వెంబడించారు. కార్మికుల ప్రశ్నలు వినడానికిగాను నెమ్మదిగా కారువద్దకు వెళ్ళుతున్నాడు. ఎన్ని ప్రశ్నలు కురిపించారు! ఉత్సాహ రణగుణ ధ్వనిలో వారి ప్రశ్నలకు సమాధానం చెప్ప ప్రయత్నించాడు. గుంపును చీల్చుకుంటూ ఒక స్త్రీ వచ్చింది. లెనిన్ చుట్టూ కార్మికులు ఇసుక రాలకుండా గుమిగూడారు. ఆ స్త్రీ మరింత దగ్గరకు వచ్చింది. లెనిన్ కారులో ఎక్కబోతున్నాడు. ఆ స్త్రీ లెనిన్ మీదికి ఉరికింది. కార్మిక, కర్షకుల శత్రువులు పంపారామెను, ఒక తుపాకి లాగి కార్మికుల ప్రేమపూజ్య నాయకునిపై—ఒకసారి రెండుసార్లు కాల్చింది.

అందరూ నిశ్చేష్టులయ్యారు. ఆ తర్వాత తమ నాయకునివైపుకు పరుగెత్తసాగారు;

"చంపేశారు"

"చంపారా?"

"ఎవరా కాల్చింది?"

"చావనీయకండి"

"చావలేదు."

లెనిన్ ఇంకా కదలకుండానే పరున్నాడు. అతనికి బాగా గాయాలు తగిలాయి. విచారగ్రస్తులైన కార్మికులు, కారులో పడుకోబెట్టారు. కారు యింటికిపోయింది. ఇంటికి చేరగానే లెనిన్‌ను మోసుకెళ్ళబోయారు. కాని వేసే ప్రతి అడుగూ ఎంతో బాధకరంగావున్నా, లెనిన్ వద్దని నిరాకరించాడు.

ప్రపంచ పెట్టుబడిదారులు, లెనిన్‌పై తుపాకి పేల్చారని వినగానే సంతోషించారు. కాని వారికోరిక నెరవేరలేదు. లెనిన్ చనిపోలేదు. గుండ్లు శరీరంలోనే వుండిపోయాయి. కాని అతని శరీరం తట్టుకోగల్గింది. లెనిన్ చేయవలసిన కార్యం ఇంకావుంది!

లెనిన్‌కు ప్రియ స్నేహితుడునూ, గొప్ప రచయితా అయిన మాక్సిం గోర్కీ, లెనిన్‌ని సందర్శించాడు. లెనిన్ తన చేయిని ఉపయో

గించలేని స్థితిలో, తల కదల్చలేని స్థితిలో వున్నాడు. గోర్కీ హత్యా ప్రయత్నం గూర్చి ఎంతో మందిపడ్డాడు. కాని లెనిన్ ఆ విషయాన్ని తప్పించివేశాడు. లెనిన్ ఇలా అన్నాడు: ప్రతివారూ తమ తమ దృక్పథాల ననుసరించి పనిజేస్తారు."

* * *

ప్రపంచ మహా సంగ్రామం అయిపోయింది. కార్మిక - సైనికులు యుద్ధరంగాలనుండి తమ దేశాలకు తిరిగివచ్చారు. ఒకడు రెండు కాళ్ళతోనూ నడుస్తున్నాడు. కాని అందులో ఒకటి కొయ్యకాలు. ఒకడు యుద్ధములో కళ్ళుబోవడంవల్ల కర్ర నేలకు కొట్టుకుంటూ నడుస్తున్నాడు. "ఇక ఏం చేయాలి" అని సైనికులు ప్రశ్నించారు. "నా ఉద్యోగం పోయింది" అని మరో సైనికుడన్నాడు. "మనం తిరిగి వచ్చినతర్వాత మనల్ని గురించి జాగ్రత్త తీసుకుంటామని వారు వాగ్దానం చేశారు." అన్నాడు మరొకడు. "నా పొలం కజేశారు" అన్నాడు ఒక వ్యవసాయక సైనికుడు.

"మనం ఎందుకు పోరాడాం?"

"ధనికుల్ని మరింత ధనికులుగా చేయడానికి,"

"మనం ఎవరితో పోరాడాం?"

"మనలాంటి కార్మికులతో, రైతులతో."

ఇదీ వారి సంభాషణ.

జర్మనీలో రష్యన్ కార్మికులలాగానే పెట్టుబడిదారులను బయటికి తరిమివేద్దామని యుద్ధరంగం నుండి తిరిగివచ్చిన సైనికులు ప్రయత్నించారు. కాని వారి బలం చాలలేదు. "విచారించకండి. ఇప్పుడు మనం ఓడిపోయాం. కాని శాశ్వతంగా గాదు. మనమే ఒకానొకరోజున విజేతలం కాగలం" అన్నారు జర్మన్ కార్మికులు.

ప్రపంచమంతటా సమ్మెలు జరిగాయి. ప్రతి దేశంలోనూ, గొప్ప గొప్ప విజయాలకు కార్మిక కర్షకులను నడిపించుచున్న సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీల లాంటి పార్టీలను స్థాపించారు.

లెనిన్ నాయకత్వంక్రింద, కమ్యూనిస్టుపార్టీలు ఐక్యమై "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్" (అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ)ను స్థాపించాయి. "అన్ని దేశాలలోని కార్మిక కర్షకులూ ఒకటిగా నిలవాలి. ఆ విధంగానే మనం మంచి ప్రపంచాన్ని బడయగలం" అన్నాడు లెనిన్.

లెనిన్ సందేశం ప్రపంచమంతటా వినబడింది. రష్యాలో అతని వాక్కు ప్రజల్ని కదల్చివేసి, మంచి యిండ్లు, మంచి ఉచిత పాఠశాలలు. అందరికి తిండి, బట్ట కలుగజేయడానికి ప్రజలు పాడుబడునట్లు చేసింది. లెనిన్ తండ్రి, పేదలకు చదువుచెప్పాలని, రాయడం, చదవడం, నేర్పాలని కోరుతుండేవాడు. కాని జారుకు ప్రజలు చదవడం, రాయడం, తెలిసికోడం అంటే ఇష్టంలేదు. కార్మికుల భూమి, విజ్ఞానయుతులైన కార్మికులుంటేనే అభివృద్ధి చెందగలదని లెనిన్‌కు తెలుసు. ప్రజలు చదవడం, వ్రాయడం నేర్చుకొని తీరాలి. తమ స్వంత సమస్యలను అర్థం చేసుకోవాలి. వారికి జ్యోతి—విజ్ఞానమనే జ్యోతి కావాలి.

దండయాత్రచేసిన సైన్యాలు నాశనంచేసిన రైలు రోడ్లను, పరిశ్రమలను బాగుచేయడానికి, నిర్మించడానికి, విద్యుచ్ఛక్తి, ఇనుము, బొగ్గు కావాలి. "వైట్" సైన్యాలు తమకు దొరికిందల్లా పాడుచేశాయి. జారు రోజులలో వదలివేయబడిన పాత ఫ్యాక్టరీలు సైతం పనిచేయడం లేదు. వాటిచేత మళ్ళా పనిచేయించాలి. రైళ్ళను నడపాలి. ప్రజలకు తిండినీ, బట్టనూ సప్లయి చేయాలి. నాశనం చేయబడ్డ వాటిని పునరుద్ధరించడమేగాక, పాత వ్యవసాయిక దేశాన్ని బ్రహ్మాండమైన పారిశ్రామిక దేశంగా మార్చాలంటే, కొత్త ఫ్యాక్టరీలను నిర్మించాలని, లెనిన్ తలచాడు. "కార్మిక పరిపాలనా, విద్యుచ్ఛక్తి కలిపితే సోషలిజం వస్తుంది" అన్నాడొకసారి లెనిన్. కొత్తవీ పెద్దవీ అయిన చాలా ఫ్యాక్టరీలలోని చక్రాలను త్రిప్పడానికి మొదటి ప్లానును లెనిన్ వేశాడు. ప్రథమ పంచవర్ష మహాప్రణాళికకు ఇది నాంది.

"నీవు చాలా ఎక్కువ పనిజేస్తున్నావ్ కామ్రేడ్!" అని లెనిన్ స్నేహితులతనిని హెచ్చరించారు.

"కామ్రేడ్ లెనిన్, మీ రిలాపనిజేస్తే జబ్బుచేస్తుంది." అన్నారు అతనిని సందర్శింప వచ్చిన కార్మికులు.

"చేయవలసినదింకా చాలావుంది. నా సంగతి విచారించకండి." తన ఆరోగ్యాన్నిగురించి తాను లెక్కచేయకపోయినా ఇతరులను గురించి ఆదుర్దా పడేవాడు. మాక్సిం గోర్కీని, అతని ఊపిరితిత్తులకు అనువైన వాతావరణంగల ప్రదేశానికి పొమ్మని చెప్పాడు. రైతులు అతనికి బహుమానంగా ఫలహారాలు పంపేవారు. ఇది ఆయనకు కోపం తెప్పించింది. ఇది "ఎలా మాన్పను. తిరస్కరించి, తిరిగి పంపివేస్తేవాళ్ళు నొచ్చుకుంటారు." జబ్బుగావున్న కామ్రేడ్స్‌కు అవి పంచిపెట్టేవాడు.

లెనిన్‌కు నిద్ర సరిగాపట్టేదికాదు. తాత్కాలిక ప్రభుత్వరోజులలో మంచులో బయట పండుకొన్న ఫలితం కన్పించుతోంది. తుపాకి గుండ్ల దెబ్బలు శరీరాన్ని మరింత కృశింపజేశాయి.

లెనిన్ ఆరోగ్యం రోజురోజుకూ మరింత పాడవుతోంది. ప్రజలెంతో ఆదుర్దా పడేవారు. లెనిన్ గ్రామసీమకు ఆరోగ్యం నిమిత్తం వెళ్లాడు. వీరా అతన్ని చూడటానికి తనబిడ్డను తీసుకవచ్చింది. చంటిబిడ్డ అతన్ని అభినందించాడు.

పరిశుభ్రవాయువు లెనిన్ని తేరుకునేటట్లుచేసింది. లెనిన్ ఆరోగ్యం కొంచెం కుదుటపడుతోందని ప్రజలకు తెలుస్తోంది. అమ్మయ్యా అనుకొన్నారు వాళ్ళు. కాని అది ఎన్నాళ్ళో నిలువలేదు. ఇదివరకంటే త్వరత్వరగా రోగం వృద్ధి అయింది.

బిడ్డను నిమురుతూ లెనిన్ ఇలా అన్నాడు. "మా కంటే మీకు సౌఖ్యతమయిన జీవితం లభిస్తుంది." వీరా వైపుకు తిరిగి ఇలా అన్నాడు "అయినా, ఈ పిల్లలను చూస్తుంటే నాకు అసూయలేదు. చరిత్రకు దిగ్భ్రమను గొల్పించే విషయాన్ని-సోషలిస్టు రాజ్యాన్ని - ఒకటి మనం సాధించాము." వీరా కొడుకును తాకుతూ "మీకోసమే చిన్న కామ్రేడ్, మేం సాధించింది" అన్నాడు లెనిన్.

* * *

1924 జనవరి 21వ తేదీన లెనిన్ మరణించాడు. ప్రపంచంలో స్వాతంత్ర్యాన్ని ప్రేమించే, గొప్పదనాన్ని హర్షించేవారందరికీ ఈ వార్త పిడుగులాసోకింది. సోవియట్‌యూనియన్ పెద్ద మరణోత్సవపు గుంపు అయిపోయింది. తమ ప్రియనాయకుని, కామ్రేడ్ ఇల్యిచ్‌ను-కామ్రేడ్ లెనిన్‌ను, చూడడానికి వేలకొలది ప్రజాసామాన్యం రావడం మొదలెట్టింది.

"మనిషి పొట్టివాడే కాని చాల గొప్పవాడు."

"అతనిహృదయం ప్రపంచమంత విశాలమయింది."

"1905 నాటి లెనిన్ నాకు జ్ఞాపకం వస్తున్నాడు. అందరూ అంతా అయిపోయిందని భావిస్తుంటే అతడు మాకు తిరిగి ఆశకలిగించాడు."

"ఎంతస్పష్టంగా చూడగలడు. ఎంతగాఢంగా ఆలోచించగలడు!" ఇదీ సంభాషణ.

నదులలో పైకి క్రిందికీ తిరుగుతూ స్టీంబోటులు దుఃఖించాయి. కార్లు తమ విచారాన్ని ధ్వనిచేయసాగాయి. కార్మిక మహా దేశమంతటా, చనిపోయిన కామ్రేడ్ లెనిన్ - గౌరవార్థం-ఒక్క క్షణం ప్రజలూ, బండ్లూ, అన్నీ ఆగిపోయాయి. పిల్లలు, యంగ్‌పయనీర్లు, వీరుని స్మారకార్థంగా అంత్యక్రియల సమయంలో పాడేపాటను పాడారు. ఆ పాట లెనిన్‌కు చాల యిష్టం.

లెనిన్ మరణం విని ప్రపంచమంతటా కార్మికులు విలపించారు.

"కాని, లెనిన్ కృషి జీవించే వుంటుంది." అన్నాడొక న్యూయార్కు కార్మికుడు.

"లెనిన్ ప్రారంభించినదాన్ని మనం కొనసాగించుదాం" అన్నాడు మోంటనా (అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఒక రాష్ట్రం లోని ప్లెంటీవుడ్ వ్యవసాయ దారుడొకడు.

"క్రాస్బీ"లోని 'మిన్నిసోటా' (అమెరికా) ఇనుప కార్మికుడొకడు ఇలా అన్నాడు. "లెనిన్ రెడ్‌స్టార్‌ను మనం అనుసరించుదాం."

"స్కాట్స్ బరోవద్ద, 'అలాబామా' (అమెరికా)లోని ఒక నీగ్రో ఇలా అన్నాడు. "లెనిన్, ప్రపంచంలోని పీడిత ప్రజలందరి కోసమూ పోరాడారు,"

న్యూయార్కులో, న్యూజెర్సీలోని ఒక యూదు ఫర్‌వర్కర్ ఇలా అన్నాడు. "అవును, యూదులపై దాడిచేయడం అంటే కార్మిక వర్గంపై దాడిచేయడం అని అతడనలేదా?"

జార్జియాలో, టర్పెంటైన్ క్యాంపులోని ఒక నీగ్రో కార్మికుడు ఇలా అన్నారు. "లెనిన్ కార్యం ఇక్కడ విఫలమయినపుడు నీగ్రోలపై జరిగే అమానుషచర్యలు ఇక జరుగవు."

ఆఫ్రికా బంగారు గనులలోని ఒక కాఫిర్ నీగ్రో ఇలా అన్నాడు "నేను లెనిన్‌ను అనుసరించుతాను, ఇక నేను బానిసగా వుండలేను."

చైనా కూలీ యొకడు ఎర్రజెండా నెగురవేసి "ఇది లెనిన్‌జెండా, ఇది నా జెండా." అన్నాడు.

పెన్సిల్వేనీయాలోనీ మెత్తని బొగ్గుగనులలోని కెంటకీలోవి గట్టి బొగ్గుగనులలోను; పండ్లచెట్లతో కూడిన కాలిఫోర్నియా లోయలోను ఇంగ్లాండులోని చెప్పుల మిల్లులలోను, బట్టల మిల్లులలోను, డిట్రోయిట్‌లోని మోటారు ఫ్యాక్టరీలలోను, చికాకో కసాయి ఫ్యాక్టరీలలోను, కార్మికులు చేసిన సమ్మెలలో, పికెటింగులలో, పోరాటాలలో లెనిన్ ప్రతిబింబించాడు. జారు కోసక్ పోలీసులు కార్మికులను హత్యగావించి నట్లే, పైన చెప్పిన ప్రదేశాలలో కూడ కార్మికులపై తుపాకీలు పేల్చబడి నాయి, కార్మికులు హత్య గావించబడ్డారు. కాని లెనిన్ స్మృతి చెప్పే దేమంటే — "లెనా బంగారు గనుల కార్మికులపై గావించిన హత్యలకు ప్రతీకారం తీసుకొన్నట్లే. ఈ అమెరికను కార్మికుల హత్యలకు కూడ పగతీర్చుకోబడుతుంది" అని.

"అలాగే బ్రిటిష్ గని కార్మికులు ఒకానొక రోజున జయించి తీరుతారు."

"మేము కూడా. జిమ్‌కొనల్లీని జ్ఞాపకముంచుకోండి. లెనిన్ అతణ్ణెంతో ప్రేమించాడు. అతనిని ఇంగ్లీషులార్డులు చంపారు" అన్నారు ఐరిష్ కార్మికులు.

*                    *                    *

సోవియట్ యూనియన్‌లో తన పాత స్నేహితుడు వొలోద్యా—మరణించడం ఇవాన్ చూచాడు. రష్యన్ కర్షకుల క్షేమానికి ఇవాన్ తీరిక లేకుండా పనిచేస్తున్నాడు. లెనిన్ చనిపోయాక, తను వొలోద్యాను మొదటిసారి కలిసికొన్న గ్రామానికి తిరిగి వెళ్లాడు.

కొడుకు, యువ ఇవాన్, శత్రువులను తరిమివేయడంలో సహాయ పడిన పిదప, కొకిష్కినో గ్రామానికి వెళ్లాడు. తన తండ్రిని గ్రామ మంతా తిప్పాడు. తండ్రి కళ్ళు తుడుచుకొంటూ "ఇదేమైనా కలా? ఇదేనా మన పాతవూరు?" అని ప్రశ్నించాడు.

అతని బాల్య స్నేహితులు, యువకాల స్నేహితులు నవ్వడం మొదలెట్టారు. "కొయ్యతోను, గడ్డితోను, కట్టిన గుడిసెలు కన్పడటం లేదనా? కామ్రేడ్ ఇవాన్, నీవు తెల్లబోయేది" అన్నాడు.

పడక గదిలో యజమానితోపాటు ఆవుకూడా నివసించడంలేదు గదూ?"

"జీవరైతుకు తమ గుడిసె చుట్టూ చేరడంత భూమీ, దానిచుట్టూ దడీ, ఇప్పుడు లేవుగదూ?" అంటూ నవ్వ మొదలెట్టారు.

"కాని ఇంకొకటి పాతది వున్నది" అన్నాడు కొడుకు ఇవాన్.

అది భూస్వామి ఇల్లు.

తండ్రిని భూస్వామి ఇంటికి తీసుకుపోయాడు. కాని భూస్వామి అక్కడ లేడు. పచ్చగడ్డిమీద కూర్చొని కార్మికులు మాటాడు కొంటు న్నారు. లోపల గదులు ఎలెక్ట్రిక్ లైట్లతో నిండివున్నాయి. "ఇవి లెనిన్ లాంపులు" అన్నాడు ముసలి రైతు. "మనకళ్లు పోగొట్టి, పొగతో చంపే కిరసనాయిలు బుడ్లు, లాంతర్లు ఇక లేవు" అన్నాడతడు.

కార్మికులు చదివే గదిలోకి తండ్రిని తీసుకుపోయాడు కొడుకు ఇవాన్. గోడమీద వొలోద్యా బొమ్మ - వ్లాడిమర్ ఇల్యిచ్ లెనిన్ బొమ్మ - వుంది. ఇంకోచోట కామ్రేడ్ లెనిన్ 'బస్ట్' కూడా వుంది. "మన గురువు, మహాగురువు, నాయకుడు" అన్నాడు ముసలిరైతు. "ఇది లెనిన్ కార్నర్" అంటూ మరొకటి చూపించాడు. మరోచోట కార్మికులు రేడియో వింటున్నారు. "జారు మనవాళ్ళ మాటల్ని మనలను విననిచ్చేవాడు కాడు. కాని ఇప్పుడు సత్యవాక్కులను, మధురవాక్కులను వింటున్నాం" అన్నా డా ముసలి రైతు.

ఆ ఇంట్లో షవర్‌బాత్స్ కూడా వున్నాయి. ఆటల పరికరాలు ప్రదేశమూ వున్నాయి. పసిబిడ్డలకు శుభ్రమైన శిశుపోషణ (నర్సరీ) శాల వుంది. శిశుపోషణశాలకు తండ్రిని తీసుకుపోయాడు ఇవాన్. ఒక పడకలో పాలబుగ్గల నీలికళ్ళ పిల్లవాడు నిద్రపోతున్నాడు. బిడ్డ ఎర్రటి ముఖం పైకి సూర్యుని వెల్తురు సోకుతుంది. నవ్వుతూ పసిబిడ్డ మేల్కొన్నాడు. యువ ఇవాన్ వంక చేతులు చాపుతూ "నాన్నా, నాన్నా" అన్నాడు.

ముసలి ఇవాన్, తన మనమణ్ణి తన చేతుల్లోకి తీసుకొన్నాడు. "లెనిన్‌పేరే పెట్టుకొందాం. వొలోద్యా అని పిలుద్దాం. వాళ్ళ నాయనమ్మ బ్రతికివుంటే ఎంత బాగుండేది. ఆమె కొడుక్కు శిశుపోషణశాలా లేదు. పడకాలేదు" అన్నాడు తాత ఇవాన్. పిల్లవాణ్ణి నర్సుకు ఇచ్చివేశారు. నర్సు కుర్రాణ్ణి స్నానాలగదికి నడిపించింది. వాడే మధ్యాహ్న భోజనానికి తయారవడానికి చేతులు కాళ్ళు కడుక్కున్నాడు స్వంతంగా. అతని తండ్రీ, తాత నది ఒడ్డుదాకా నడిచివెళ్లారు. ఇక్కడ ఇనుపకంచెలు లేవిప్పుడు; ఇదే వారి ఇల్లు, భూమి, ప్రపంచం.

నది ఒడ్డున కొంతమంది పిల్లలు ఆడుకొంటున్నారు. నదిమీద ఒక పడవ తేలవేశారు. బోటుకు తెరచాప వుంది. తెరచాపపైన సుత్తి, కొడవలి చిహ్నం వుంది. సుత్తీ, కొడవలి చిహ్నానికి అర్థం రైతు కూలీల సమ్మేళనం. అందులో ఒక కుర్రాడు వాళ్ళదగ్గరకు పరుగెత్తుక వచ్చాడు. యువక ఇవాన్ ఇలా అన్నాడు. "అబ్బాయి, ఇడుగో

మీ తాత !" పిల్లవాడు దుడ్డుముక్కలా వున్నాడు. ప్రకాశవంతమైన కండ్లు. తాత మనవణ్ణి కౌగలించుకొన్నాడు. "పీటర్, నీవు నా మనుమడివి. ఈ ప్రపంచం మీదే. నీవూ, నీ తమ్ముడు వొలోడ్యాలాంటి వాళ్ళదే ఈ ప్రపంచం." "తాతోయ్ ! మరే, మరే, నే పెద్దవాణ్ణయాక 'యంగ్ పయనీర్' అవుతాను" అన్నాడు కుర్రాడు ఆదుర్దాగా.

"నీ బోటు పేరేమిటి ?"

"అరోరా. విప్లవంలో మొదటి తుపాకిదెబ్బ గొట్టిందే అలాంటిది" అంటూ కుర్రాడు ఆటలోకి పారిపొయ్యాడు.

తాత ఇలా అన్నాడు. "నాకు బాగా జ్ఞాపకం వుంది. నాకు బోటు కావాలని వుండేది. ఆ పెద్ద ఇంట్లోవున్న భూస్వామి కొడుక్కి బోటు వుండేది. కాని వాడు నన్ను దాన్ని ముట్టుకోనిచ్చేవాడు కాడు."

*   *   *

తర్వాత వాళ్ల పొలాల్లోకి వెళ్ళారు. పూర్వం రైతులు భూస్వామికి బానిసత్వం చేసిన ప్రదేశం ఇది. యువక ఇవాన్ తండ్రికి పెద్ద ట్రాక్టర్ (మరనాగలి) చూపించాడు. 20 మంది రైతులు ఇరవై గుర్రాలతో దున్నేదానికంటె ఇది ఎక్కువ దున్నుతుందని చెప్పాడు. రైతులు పంట కోయడానికి కొడవళ్లు పుచ్చుకొని నడుములు విరగ్గొట్టుకోరు. ఒక్క మెషిన్ వంద కొడవళ్లు చేసే పనిచేస్తుంది. ఒక్క రైతు డ్రైవర్ సీట్‌లో కూర్చొని నడిపించితే చాలు."

"అవును. రైతులు ప్రపంచం నెత్తిమీదే కూర్చుంటున్నారు" అన్నాడు తండ్రి.

"అవును, భూమి రైతులకు, కూలీలకు చెందివుంది కాబట్టి కూర్చుంటారు" అన్నాడు కొడుకు. అమెరికాలో రైతు "నాకో ట్రాక్టరు కావాలి" అంటాడు.

"ఓ. కె. (సరే) నేను నీకు డబ్బు అప్పిస్తాను" అంటాడు మిష్టర్ డాలర్.

అమెరికను రైతు తన కృషితో సృష్టించిన డబ్బు అప్పుగా తీసుకొంటాడు. ఆ డబ్బుతో మళ్ళా తన కృషితోనే పంట పండించుతాడు. కాని ఆ పంట తింటానికి అతనికి ఉండదు.

"ఓ. కె. ఆ ట్రాక్టర్ నా కిచ్చేయి" అంటాడు మిష్టర్ డాలర్.

రైతు పొలాలను మిష్టర్ డాలర్ తణఖా వుంచుకొంటాడు. మార్కెటులో ధరలు పడిపోయాయి. తన పంటను అమ్మలేడు రైతు. తన తణఖాను వదలించుకోలేడు. పొలం కొంటానికే అప్పిచ్చిన మిష్టర్ డాలర్ ఋణాన్ని రైతు తీర్చలేడు.

"ఓ. కె. ఆ పొలం నా పేర రాశేయ్" అంటాడు మిష్టర్ డాలర్.

అమెరికన్ రైతు వ్యవసాయ కూలీ అవుతున్నాడు. లేదా పట్టణాలకు పోయి ఫ్యాక్టరీ కూలి అయినా అవుతున్నాడు.

అయినా మిష్టర్ డాలర్ "ఓ. కె." అంటాడు.

సోవియట్ యూనియన్‌లో, భూమిని పనిచేసేవారే తీసుకొంటారు. వాళ్ళే సాగు చేసుకొంటారు. వాళ్ళు పర్వతాలను దగ్గరకు తెస్తారు. గాలికి గొలుసులు వేస్తారు. నదుల ప్రవాహాన్ని అడ్డగిస్తారు. మళ్ళా నదులను ప్రవహింపనిస్తారు. (రైలురోడ్లు, విండ్‌మిల్సు, ఆనకట్టలు).

ఒక కార్మికుడిలా అంటున్నాడు, "పూర్వం మనం బండి ఎక్కో, గుర్రమెక్కో, గుంటలు, మెరకా పల్లాలున్న రోడ్లమీద ప్రయాణం చేసేవాళ్ళం. మనం తయారు చేస్తున్న మోటార్లు నడవడానికి యిపుడు నున్నటి తారురోడ్లు వేస్తున్నాం. ఇలా మనం పర్వతాలను దగ్గరకు తెస్తున్నాం."

"మనం పెద్దపెద్ద విండ్‌మిల్సుపెట్టి, గాలిని ఉపయోగించి గాలితో ధాన్యపు మరల చక్రాల తిప్పిస్తున్నాం. ఒకానొకప్పుడు గాలికి బానిసలం. కాని ఇప్పుడదే మనకి బానిస. ప్రజలు ఇప్పుడు స్వతంత్రులు గాదు మరీ" అన్నాడు మరొకడు.

"నీపర్ నదిమీద బ్రహ్మాండమైన వంతెన (డామ్) కట్టాం. అది నదినీరు వృధాగా పోకుండా ఆపుతుంది. గర్జనచేసే విద్యుత్తునుండి విద్యుచ్ఛక్తి వేలకొలది కార్మికుల ఇండ్లకు లైటు ఇస్తోంది. ఫ్యాక్టరీ చక్రాలను తిప్పుతోంది. లెనిన్ అంచనా అమలులోకి వచ్చింది. ఈ నది విద్యుచ్ఛక్తివల్ల, 18,000,000 మంది శ్రమపడే కార్మికులకు విముక్తి కలిగింది." అన్నాడు మరొకడు.

అమెరికాలో, ఫ్యాక్టరీలో ఒక క్రొత్త మిషన్‌ను పెట్టారను కోండి, వేలకొలది కార్మికుల జీతాల కవర్లమీద ఒక చిన్న చీటి తగి లించుతారు ? "మీరు పనిలోకి రానవసరంలేదు" అంటూ. ఇతర కార్మికులకు ఇలా చెప్పుతారు. "మీ జీతాలు 100 కి 10 తగ్గిస్తున్నాం."

సోవియట్ యూనియన్‌లో, యంత్రాలు కార్మికుల బానిసలు. యంత్రాలు మరిన్ని వస్తువులను తయారుచేస్తాయి. కార్మికులు తక్కువ గంటలు పనిచేస్తారు. తక్కిన కాలం చదవడం, అధ్యయనం చేయడం, ఆడుకోవడం, ప్రయాణాలు చేయడం, నాటకాలకు, సినీమాలకుపోవడం, స్నేహితులతో కాలంగడపడం, కుటుంబంతో ఉండటం – ఇలా గడిపి వేస్తారు. ఎక్కువ వస్తువులు కార్మికులకే పోతాయిగాని, అమెరికాలో లాగా, ఏమీ పనిచేయని మిష్టర్ డాలర్‌కే అన్ని వస్తువులూ పోవు.

"ఇతర దేశాలతో కలియడమే గాక. ఆ దేశాలన్నిటనీ మించి పోవాలి" అన్నాడు కామ్రేడ్ లెనిన్. మొదటి ప్లానునుండి బ్రహ్మాండమైన పంచవర్ష ప్రణాళికవృద్ధి అయింది. స్టాలిన్ ఆధ్వర్యాన, బ్రహ్మాండమైన పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ నిర్మించే నూతన ప్రభుత్వం నడుస్తోంది. లెనిన్‌కు విశ్వాసపాత్రుడైన శిష్యుడగు స్టాలిన్, ప్రపంచ కార్మికులకు, కార్మిక ప్రభుత్వానికి నాయకుడయ్యాడు.

ప్రపంచ యుద్ధకాలంలో, పీటర్సుబర్గు పెట్రోగ్రాడ్‌గా మారింది. ఇపుడు కార్మికులు దానికి లెనిన్‌గ్రాడ్ అని పేరుపెట్టారు. లెనిన్ జన్మస్థానమూ, బాల్యదశ గడిపిన స్థలమూ అయిన "సింబర్స్కు"ను "యుల్యానావస్క్" అని పేరుపెట్టి, లెనిన్ పుట్టిన వంశానికి (యుల్యానావ్ వంశం)

గౌరవం తెచ్చారు. లెనిన్ బాల్యస్నేహితురాలు, వీరా (కార్మిక స్త్రీ) యుల్యనావ్స్క్‌ను వదిలి, లెనిన్‌గ్రాడ్‌లో ఫ్యాక్టరీకి అధ్యక్షురాలుగా వెళ్ళింది. చలికాలంలో ఉన్నికోటూ, చెప్పులూ లేనందున బయటికి వెళ్ళకుండా ఇంట్లోనే కూర్చోనవసరంలేదు. వీరా బిడ్డకు, ఒకప్పుడు ధనికుల పిల్లల ఆటప్రదేశాలయిన మంచుతో గప్పిన కొండలకు వీరా కొడుకు ఇప్పుడు ప్రథమ తీవిగా వెళ్ళతాడు.

'వీరా కొడుకు యంగ్ పయనీర్'కూడా. యంగ్ పయనీర్ల ఆశయం సోవియట్ రిపబ్లిక్‌కోసం, పీడిత ప్రపంచంకోసం "అన్ని వేళలా తయార్" తన మాతృభూమిలో కార్మికులు పొందుచున్న అభివృద్ధిని చూచి తమ శత్రువులు బాధపడుతున్నారనే విషయాన్ని తెలుసుకొనే వయస్సు వచ్చింది వీరా కొడుక్కి. సోవియట్ శత్రువులు "ఇది ఒక్క సంవత్సరంకన్నా ఎక్కువ నిలవదు." అనేవాళ్ళు. కాని లెనిన్ చచ్చిపోయేసరికే 7 ఏండ్లు నిలిచింది. ఇప్పటికి అది అనేక సంవత్సరాలు కూడా నిలిచింది.

"అది శాశ్వతంగా నిలుస్తుంది. మేము ఇక్కడ దానిని ఉదాహరణగా తీసుకొని అనుసరించుతాం." అంటా డొక అమెరికా కార్మికుడు. మిల్లు యజమాని కార్మికుల వైపుకు తిరిగి "ఓ! నీకలాంటి భావాలున్నాయా ? నిన్ను లాఠీచార్జి చేస్తున్నాం!" అని అంటాడు.

కార్మికులు జవాబు చెప్పారు. "నీవు చితక కొట్టేది, టొమాటో పళ్ళు. కాని విప్లవాన్ని కొట్టలేవు."

బాస్ (యజమాని)కి పిచ్చెత్తి పోతుంది. కార్మికుల మాతృభూమిపైన విసరివేసే మందుగుండుగా ఈ కార్మికుని తయారుచేయాలని ప్రయత్నించుతాడు.

కాని కార్మికులు ఇదివరకెన్నడూ ఎరుగనంత బాధపడుతున్నారు. తన ఇంటినుండి అప్పుడే వెళ్ళగొట్టబడిన ఒక కార్మికుడు "నేను యజమానికోసం పోరాడను." అన్నాడు. "నేనూ అంతే" అంటున్నాడు. తిండికోసం వరసగా నిలబడిన కార్మికులలో ఒకడు. దేశమతంటా

కాళ్ళరిగేటట్లు తిరిగిన ఇల్లు వాకిలి లేని అబ్బాయి ఒకడు. "డిటో" అన్నాడు. "డిటో" అన్నారు తిండి అడిగితే పోలీసు లాఠీ దెబ్బలు పొందిన కార్మికులు. "డిటో" అన్నారు నాజీలచే చిత్రహింసలకు గురిచేయబడిన జర్మను కార్మికులు. "ఇక్కడ మన జీవితం రోజు రోజూ దుర్భరమై పోతున్నది. అక్కడ రష్యాలో జీవితం రోజురోజూ సుఖప్రదమౌతున్నది" అని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు.

సోవియట్ యూనియన్‌లోని కార్మికులు ఇలా అన్నారు: "మనమింకా బలపడాలి. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో గత ఐదేళ్ళలో మనం అనేక అద్భుత కార్యాలు గావించాం. మనం ఎన్నడూ ఎరుగనంత బలాన్ని సంపాదించాలి. యం. ఫ్రాంక్, హెర్. మార్క్, లార్డ్ పౌండ్, మిష్టర్ డాలరూ గనుక మనమీద దాడిసల్ప ప్రయత్నించితే, వాళ్ళకి చేతినిండా పని కల్పించాలి."

సోవియట్ యూనియన్‌ను రక్షించడానికి, కార్మిక కర్షకుల రెడ్ ఆర్మీ ఎప్పుడూ సిద్ధంగానే ఉంది. కార్మికులు పెట్టుబడిదారులను మళ్ళా ఫ్యాక్టరీల ఛాయకు రానీయరు. రైతులు మళ్ళా భూములను భూస్వాములచే లాక్కోనీయరు. వారు యుద్ధాన్ని కోరరు. సోవియట్ ప్రభుత్వం అన్ని విధాలా శాంతిని కాపాడ ప్రయత్నించుతుంది. కాని కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన ఈ మాటలతో సోవియట్ ప్రజలంతా ఏకీభవించుతారు.

"మేం ఇతరుల భూమి ఒక్క అడుగు కూడా కోరం. మేం మా భూమిలో ఒక్క అంగుళాన్నికూడా వదులుకోం."

"కామ్రేడ్ స్టాలిన్ చెప్పింది నిజం. మేమూ మీతోనే వున్నాం." అన్నాడు అమెరికన్ కార్మికుడు.

"మమ్మల్ని కూడా లెక్కవేసుకోండి" అన్నాడు బ్రిటిషు కార్మికుడు.

హిందూదేశంలో ఇంగ్లాండు క్రింద పరిపాలింపబడే 40 కోట్ల జనులు "మీరు మీ పీడకులను వదిలించుకొన్నట్లే, మేముకూడా వదిలించుకొంటాము!" అని అన్నారు.

ఫ్రాంసుచే పరిపాలింపబడే ఇండో చైనాలోని ఒక రైతు ఇలా అంటాడు: "రష్యన్ కార్మికులారా! మీ వెనుక మేం వున్నాం. మీ కోసం కూడా మేం పోరాడుతాం."

పెట్టుబడిదారుల కోసం బట్టలు నేసే, బొగ్గును తవ్వే కార్మికులు కమ్యూనిస్టుపార్టీలో చేరుతున్నారు. "ఇది మన పార్టీ. ఇది నూతన జీవితానికి పోరాటాన్ని నడుపుతుంది. ఇది లెనిన్ పార్టీ" అన్నారువాళ్ళు.

ఆకలిమంటలూ, భయంకర చిత్రహింసా, అమెరికా, జర్మనీ, జపాను, ఆఫ్రికాల కార్మికుల గొంతు పిసుకుతున్నాయి. 1910 లో, రష్యా యొక్క నిరాశాపూరిత అంధకార దినాలలో లెనిన్ "అధైర్యపడవద్దు" అని హెచ్చరించాడు. "అధైర్యపడవద్దు" "ఈ అంధకారం వెళ్ళి పోతుంది. ఈ బురదనీటి తరంగం అణగిపోతుంది. మనం మరో నూతన తరంగంలో తేలిపోతాం. శ్రామికవర్గ విప్లవం తిరిగి జనిస్తుంది అన్న లెనిన్ కంఠం ప్రతిధ్వనించుతోంది.

అంధకారం గతించిపోయింది. నీపర్ నదీ శుభ్ర జలతరంగాలకు బురదనీళ్ళు లొంగిపోయాయి. ప్రజలకు స్పష్టజ్యోతిని ఇస్తున్నదా జలం. కార్మికులా తరంగంపై తేలియాడుతున్నారు. శ్రామికవర్గ విప్లవం, కార్మిక విప్లవం విజయవంతమైంది. కణం జ్వాలలలాగా మారింది. జ్వాల ఇతర దేశాలలో కూడా మండుతోంది. ప్రతి సంవత్సరం జనవరి 21 వ తేదీన కామ్రేడ్ లెనిన్ జ్ఞాపకార్థంగా కార్మికుల హృదయాలలో ఆ జ్వాల ప్రజ్వరిల్లుతోంది. కార్మికుల పిల్లలు, కామ్రేడ్ ఇల్యిచ్‌ను – లెనిన్‌ను – గురించిన పాటలు పాడతారు.

"కామ్రేడ్, కామ్రేడ్ లెనిన్
బీదలనే ప్రేమించెన్
ధనికులనే ద్వేషించెన్
నవంబరు ఏడవ తేదీనా
నడిపించెన్ (రష్యను) కార్మికులన్

* *

మహా ధైర్యశాలిగా
మా లెనిన్ వీరుడూ
ఇట్టి ధిరునీ, మున్
కనివిని యెరుగముగా

*   *

లెనిన్ వీరపతాకన్
మింటికంటు నట్టులన్
ఎగురవేయు దెగరవేయుడీ !

*   *

కార్మిక యోధులమౌ మనమూ
పనిచేయుటయో చనిపోవుటయో
మన ధర్మముగా మన ధర్మముగా
దుర్భర దుర్దశ మనమూ
తొలగించిన యానాడూ
మా లెనిన్ పతాకం, విజయ పతాకం
స్వర్గభూమిలో స్వచ్ఛకాంతితో
ఎగురు చుండునూ, స్వేచ్ఛగాన్
ఎగురు చుండునూ...."

---

# లెనిన్ జీవితంలో జ్ఞప్తి వుంచుకోవలసిన తేదీలు

| | |
|---|---|
| 1870–ఏప్రియల్ – 2 | వ్లాడిమర్ ఇల్యిచ్ యుల్యానావ్ (లెనిన్) సింబర్స్కులో (ఇప్పుడు దానిని యుల్యానావస్క్ అంటున్నారు) జన్మించాడు. |
| 1879 – ఆగస్టు – | హైస్కూలులో చేరాడు. |
| 1887 – మే 20 – | లెనిన్ పెద్ద అన్న అలగ్జాండరును, మూడవ అలగ్జాండరు (జార్) ను హత్య చేయాలను ప్రయత్నంలో పాల్గొన్నందుకు ఉరి దీశారు. |
| 1887 జూన్ 22 – | హైస్కూలులో ఉత్తీర్ణుడయ్యాడు. |
| 1887 – ఆగస్టు 25 – | కజాన్ యూనివర్సిటీ లా కాలేజీలో చేరాడు. |
| 1887 – డిసెంబరు 17 – | రహస్య మీటింగులో పాల్గొన్నందుకు ఇంకా 40 మంది కజాన్ యూనివర్సిటీ విద్యార్థులతో పాటు అరెస్టయాడు. |
| 1887 – డిసెంబరు 19 – | యూనివర్సిటీనుండి వెళ్ళగొట్టి తాతగారి ఎస్టేటు 'కొకుష్కినూ'కు పంపారు. |
| 1888 – ఆకురాలుకాలం – | కజాన్ తిరిగివచ్చాడు. కాని యూనివర్సిటీలో చేర్చుకోలేదు. కార్మిక గ్రూపులలో చేరి, మార్క్సు రచనలు పఠించనారంభించాడు. |
| 1889 – ఆకురాలుకాలం – | కుటుంబంతో సహా 'సమారా'కు వెళ్ళాడు. అక్కడ చదువ నారంభించాడు. యువక కార్మికులకు బోధింపసాగాడు. |
| 1891 – నవంబరు–27 – | పీటర్సుబర్గ్ యూనివర్సిటీలో ఎక్కువ మార్కులతో పరీక్ష ప్యాసయ్యాడు. లాయర్ డిగ్రీని సంపాదించాడు. |

| | |
|---|---|
| 1892 – | 'సమారా' తిరిగివచ్చి ప్రాక్టీసు పెట్టాడు. కార్మిక సర్కిల్సులో బోధచేస్తూనే యున్నాడు. |
| 1893 – | పీటర్సుబర్గ్‌లో నివసించి, పనిచేయడానికి వచ్చాడు. తన మొదటి గ్రంథం వ్రాశాడు. |
| 1894 – | తన కాలాన్నంతా కార్మికులకు బోధచేయుట లోనూ, ఆర్గనైజు చేయుటలోనూ, వ్రాయుట లోనూ గడుపుతాడు. కార్మిక సర్కిల్సు అన్నిటిని ఒకే దృఢమైన పార్టీగా ఐక్యపరచుతాడు. |
| 1895 – మే – సెప్టెంబరు | ప్రవాసంలోవున్న ఇతర రష్యన్ విప్లవ నాయకులను కలిసికోడానికి స్విడ్జర్లండు పోయాడు. |
| 1895 – నవంబరు | పీటర్సుబర్గుకు తిరిగివచ్చాడు. స్థానిక సోషల్ డెమాక్రటిక్ పార్టీకి నాయకుడయ్యాడు. |
| 1895 – డిశంబరు – 20 | పీటర్సుబర్గులో అరెస్టయ్యాడు. |
| 1896 – | జైలులో |
| 1897 – ఫిబ్రవరి – 10 – | సైబీరియాకు 3 ఏండ్ల ప్రవాస శిక్షకై పంపారు. |
| 1897 – మే – 20 – | ఎన్సీ రాష్ట్రంలోని షుషెన్సుకోయీ గ్రామం ప్రవేశించి అక్కడే నివసించి పనిచేయ సంకల్పించుకున్నాడు. |
| 1898 – | రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీ ప్రథమ కాంగ్రెస్ జరిగింది. లెనిన్ ప్రవా సంలో వున్నా పార్టీ పేపరైన 'రబోత్చాయ గజిటా' (వర్కర్స్ జర్నల్ – కార్మిక పత్రిక)కు సంపాదకునిగా ఎన్నుకున్నారు. |

1898 - జూలై - 22 - తనతో ప్రవాసశిక్ష అనుభవించుచున్న నడ్జెడా- కె. కృపాస్కయాను వివాహమాడాడు.

1900 - ఫిబ్రవరి - 11 - ప్రవాసం అయిపోయి మధ్యరష్యాకు వచ్చాడు.

1900 - జూన్ - 3 - పీటర్సుబర్గ్‌లో అరెస్టు. 10 దినాల తరువాత విడుదల.

1900 - జూలై - 29 - రష్యన్ భాషలో మొదటి ప్రధాన మార్క్సిస్టు పత్రిక "ఇస్క్రా" (కణం)ను ప్రకటించ డానికిగాను జర్మనీ వెళ్లాడు.

1900 - డిశంబరు - "వాట్ ఈజ్ టు బి డన్" (ఏం చెయ్యాలి) అనే సుప్రసిద్ధ గ్రంథాన్ని వ్రాశాడు.

1903 - జూలై - అగస్టు - బ్రిస్సెల్సులోనూ, లండనులోనూ జరిగిన రష్యన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ రెండవ సమావేశంలో పాల్గొన్నాడు. ఇచ్చటే పార్టీ బోల్షివిక్కులూ, మెన్షివిక్కులూ అని రెండు ముఠాలుగా చీలుతుంది. బోల్షివిక్కులకు లెనిన్ నాయకుడు.

1905 - నవంబరు - 20 - మొదటి రష్యన్ విప్లవకాలంలో పీటర్సు బర్గుకు తిరిగి వచ్చాడు.

1907 - మే - 9 - పార్టీ ఐదవ కాంగ్రెసుకు లండను వెళ్లాడు. యూరోపులోనే వుండిపోయాడు. ప్రవాసంలో వుండికూడా బోల్షివిక్కులకు నాయకుడుగా తన పనిని నిర్వర్తించుతాడు.

1914 - అగస్టు - ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమైంది. ఆస్ట్రి యాలో లెనిన్‌ను వెంటనే అరెస్టుచేసి స్విట్జ ర్లండుకు ప్రవాసం పంపారు.

1915 – సెప్టెంబరు – 5 – అంతర్జాతీయవాదులు, విప్లవకారులూ, అయిన సోషలిస్టుల కాన్ఫరెన్సు స్విట్జర్లాండులోని జెమ్మర్వాల్డులో జరిగింది. లెనిన్ దానిలో ప్రముఖ పాత్ర వహించాడు. యుద్ధ వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించుతాడు.

1917 – మార్చి – 15 – స్విట్జర్లాండులోని జ్యూరిచ్‌లో వుండగా రష్యా విప్లవాన్ని గురించి, జారును కూలద్రోయడాన్ని గురించిన వార్త వింటాడు.

1917 – ఏప్రియల్ – 16 – పెట్రోగ్రాడ్‌కు (పీటర్సుబర్గుకు కొత్తపేరు) వచ్చాడు. వేలకొలది కార్మికులు, సైనికులు హర్షధ్వానాలతో స్వాగతం ఇస్తారు.

1917 – ఏప్రియల్ – మే – బోల్షివిక్ కాన్ఫ రెన్సులో పాల్గొన్నాడు. ఇక్కడ విప్లవాన్నింకా కొనసాగించాలనే అతని పాలసీ అంగీకరించబడింది.

1917 – జూలై – నవంబరు–అండర్ గ్రౌండుకు పోవలసి వచ్చింది. ఐనప్పటికీ బోల్షివిక్ పార్టీతో నిరంతరం సంబంధముంచుకుని దానిని నడిపాడు.

1917 – నవంబరు – 6 – మారువేషంతో బోల్షివిక్కు పార్టీ ప్రధాన కార్యాలయమగు స్మాలెన్స్కి సంస్థకు వచ్చాడు. తిరుగుబాటు సన్నాహాలను నడిపాడు.

1917 – నవంబరు – 7 – పెట్టుబడిదారీ ప్రభుత్వం కూలద్రోయబడింది. లెనిన్ ఆధ్వర్యాన సోవియట్ ప్రభుత్వం స్థాపించబడింది.

1918 – ఆగస్టు – 30 – లెనిన్‌పై తుపాకి కాల్పులు జరిగాయి. గాయపడ్డాడు.

1919 – మార్చి – 2 – కమ్యూనిస్టు యింటర్నేషనల్ మొదటి కాంగ్రెసును ప్రారంభించాడు.

1919 – డిశంబరు – మొదటిసారి తీవ్రంగా జబ్బుచేసింది.

1922 – మే – 26 – చాలా తీవ్రమైన జబ్బుచేసింది.

1922 – నవంబరు – 3 – కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 4 వ కాంగ్రెసులో ఉపన్యసించగలుగుతాడు.

1922 – నవంబరు – 20 – మాస్కో సోవియటు ముందు ఉపన్యాసం యిస్తాడు. ఇదే తుది ఉపన్యాసం.

1924 – జనవరి – 21 – వ్లాడిమర్ ఇల్యిచ్ లెనిన్, ప్రథమ సోవియట్ ప్రభుత్వ సంస్థాపకుడు, ప్రపంచ కార్మికులకు మహానాయకుడు, బోధకుడు, మాస్కో సమీపంలోని గోర్కీ నగరంలో మరణించాడు.

---

పార్టీ అంటే...
అక్షౌహిణులను మించిన నేతులు
ఉజ్వల మస్తిష్కాలూ కళ్ళూ
కూడి ఒకటిగా కృషి గావిస్తాయ్ !
పార్టీలోనే ఒకరి కొక్కరం
తోడూనీడై సహకరించుతూ
అందరాని ఆ గగనతలానికి
ప్రాజెక్టులతో నిచ్చెన లేస్తాం
పార్టీ అంటే కడలి మధ్యమున
ముందుకు నడిపే మార్గదర్శియే
సమస్త శ్రామిక జనతా శ్రేణికి
వెన్నుదన్నుగా నిలిచిన పార్టీ

మన ఆశయాల అమరత్వానికి
పార్టీయే ఒక సజీవ చిహ్నం
ఎన్నడు వీడని ఓటమి నెరుగని
విశ్వాసానికి అది సంకేతం
నిన్నటి బానిసలంతా ఇప్పుడు
సామ్రాజ్యాలను కూల్చే యోధులు
కార్మికవర్గపు మహా మేధగా
బలసంపదగా కాంతిచ్ఛటగా
విరాజిల్లునది మన పార్టీయే
లెనినూ పార్టీ ఒకే రక్తమును
పంచుకు పుట్టిన కవల పిల్లలే
ఏ ఒకదానిని స్మరించినా ఆ
వెంటనె స్ఫురించు రెండవ పేరే

— మయకోవ్‌స్కీ



